# విద్యాదర్శము



కోటగిరి వేంకటకృష్ణారావు.



శ్రీ॥ రా॥ రాజా కోటగిరి సత్యనారాయణరావు,

బహద్దర్ జమీందారుగారు

(9—9—'35 [illegible])



రాజా కోటగిరి పార్థసారథిరావు బహద్దర్
జమీందారుగారు



రాజా కోటగిరి వేంకట కృష్ణారావు బహద్దర్
జమీందారుగారు, కృతికర్త.

# పాత్రలు

## —♦ పురుషులు ♦—

చంద్రశేఖరుఁడు
ప్రతాపవర్మ
విజయవర్మ
మాధవవర్మ
విక్రమవర్మ
శూరసేనుఁడు
గోపాలవర్మ
సదానందస్వామి
చిదానందుఁడు
రాముఁడు
భీముఁడు
సేవకుఁడు
సోముఁడు
కాముఁడు

## —♦ స్త్రీలు ♦—

హేమలత
తారాబాయి
మహాలక్ష్మి

# ప్రణయాదర్శము

## ప్రథమాంకము

### ప్రథమరంగము

[రాముఁడు భీముఁడు ఖడ్గపాణులై రాజమార్గమునఁ బ్రవేశించుచున్నారు]

రాము: భీమా! వంశపరంపరాగత విక్రమవర్మ ప్రతాపవర్మల కుటుంబ వైరములు, దినదినక్రమమున నశింపక క్షణక్షణాభ్యుదయమున మిన్ను ముట్టుచున్నవి.

భీము: మిన్నుముట్టుట గాదు, మన వెన్నుఁదట్టుచున్నవి. ఆఁబోతులు పోరాడుట, లేగల కాళ్ళు విఱుగుట. యజమానుల కుటుంబ వైరములు తదాశ్రితకోటి రూపు మాపుట సహజమైనది.

రాము: ఇనుమును బట్టి యగ్నికి సమ్మెట పెట్టు. యజమానులను బట్టి సేవకులకుఁ దత్సంబంధులకు నలముకొను చున్నది. మనవంటి స్వల్పవేతనగాండ్రకు మిక్కుటమైన సంకటము. రాజద్రోహమునకై పాఱిపోవలెను. రాజభక్తికై చావవలెను. ముందు నుయ్యి వెనుక గొయ్యి.

భీము: గోడపెట్టు, చెంప పెట్టు మనలఁ బట్టి చావగొట్టు. మన ప్రతాపవర్మగారెంత యొదుగుచున్నను, విక్రమవర్మ కయ్యమునకుఁ గాలుఁద్రవ్వు.

రాము: అదిగో! మన యజమాని విరోధి సేవకు లిటు వచ్చుచున్నారు. వీరితో గిల్లికజ్జా తెచ్చెదను.

భీము: అది యెంతసేపు. వారిని నిర్దేశించి తొడ చఱచినఁ జాలు; కవిసెదరు.

రాము: నోరు మాటాడుచున్నను. నొసలు వెక్కిరింపవలయును. తొడ చఱువ వలదు. మీసమును దువ్వెదను.

భీము: (నగుచు) ముల్లు పెఱికి కొఱ్ఱడఁచినట్లు. కానిమ్ము.

ప్రణయాదర్శము

(సోముఁడు, కాముఁడు ప్రవేశించుచున్నారు)

రాము : (ఓరచూపులతో) మీసమును సవరించుకొనుచున్నాఁడు.

సోము : ఏమోయి! మమ్ముఁజూచి మీసమును దువ్వెదవా!

భీము : ఏమయ్యా! కయ్యాలకుఁ గాలుఁ దువ్వెదరా!

రాము : నినుఁ జూచి గాదు; మీసమున్నది గనుక సవరించుకొంటిని.

కాము : అయిన, మీసము లేని దెవ్వనికి?

భీము : నీకును గలదేమో!

సోము : అయ్యది మన మనఖడ్గ విద్యాపాండిత్యమునఁ గాని నిర్ణయింపఁ బడదు.

రాము : అట్లైన నొకచేయిఁ జూచెదవా!

కాము : నీ కంటెను దక్కువ తినిన వాఁడెవఁడు?

భీము : పై కరుదేరిన జెను కాదువాఁడును లేఁడు.

కాము : ఏదీ! నిలువంబడుము. (ఖడ్గ మొఱనుండి తీయును)

రాము : కానీ మాత్రము. (తనలో) తలపడెదను.

భీము : రామా! (జనాంతికముగ) మన ప్రభువుగారి మేనల్లుఁడుగూడ వచ్చు చున్నాఁడు. తలపడుము, తలపడుము.

(నల్వురును ఖడ్గాఖడ్గిఁ బోరాడుచున్నారు)

విజయవర్మ : (ప్రవేశించుచు)

మత్తకోకిల.

సంతసింతురు సాటివా రుపసంహరింపుడు కోపముల్
కొంతయైన వివేక ముండదె క్రొవ్వుఁ గన్నుల కెక్కినన్
బంతమూనక దింపుడీ కరవాలము ల్వడి నింత రా
ద్ధాంత మంతయు రా జెఱింగినఁ దారసిల్లు నపాయముల్.

(పోరు వారించుచున్నాఁడు)

(తెరలో)

విజయా! తుళ్లిపడకు, తుళ్లిపడకు! సేవకులారా! భయపడకుడు.

శూరసేనుడు ; (ఉత్ఖాతఖడ్గుఁడై రోషముతోఁ బ్రవేశించుచు)

ఉ. చండతరోగ్ర నిగ్రహకషాయిత నేత్రుఁడ నైతినేని బ్ర
హ్మాండము బీటవాఱును వియత్తల ముత్తలమొందు విద్విష
త్కాండ భయాటవీదహనకార్యమహాప్రతిభాసమగ్ర కో
దండకళాధురీణుఁడఁ గదా! యెదురున్నె జగత్త్రయంబునన్.

విజయ : శూరసేనా! నిర్నిమిత్తంబుగఁ గలహంబునకుఁ గవిసిన సేవకుల మందలించి శాంతిఁ జేకూర్పఁదలఁచు నాపై నుఱికి పూర్వవైరము లేల పెల్లగింతువు. శాంతి స్థాపనమున నాకుఁ దోడ్పడుము.

శూరసే : ఛీ! ఛీ! విక్రమ ప్రతాపవర్మల కుటుంబములకు సఖ్య మలవడుట వట్టిది. ఎంత గతిమాలి నీ మామ పాదాక్రాంతుఁడై బతిమాలుచున్నను, విక్రమవర్మ మేనల్లుఁడ నగు నేను మాత్రము సంధి గావింప నీయను. మార్జాల మూషికములకు, సర్పమండూకములకు, హర్యక్ష మాతంగములకు, మాకు మీకు స్నేహభావము మరియొక జన్మమున సుమా? నీవు శరణన్నను, వెన్ను జూపినను, విడువను. పిఱికిపందలగు సేవకులారా! చూచెద రేల?

(పోరాడుదురు.)

ప్రతాపవర్మ : (ప్రవేశించుచు) విజయా! పోనీయకు పోనీయకు. ఏఁడీ? ఏఁడీ? తద్దురాత్ముండు విక్రమవర్మ.

విక్రమవర్మ : (ప్రవేశించుచు) ప్రతాపవర్మా? నిలు నిలు. ఈనాఁటితో మత్క్రోధాగ్ని చల్లారినది. శూరసేనా? ఆ పాపిష్ఠునిఁ జూపింపుము.

(తెరలో)

పౌరులారా! మన ప్రతాపవిక్రమవర్మాదులకుఁ బోరు ఘోరంబయ్యె. సద్గుణ గణ గరిష్ఠుండగు మన ప్రతాపవర్మకుఁ దోడ్పడుడు. రండు రండు. కొందఱు పౌరులు ప్రవేశింతురు.

(తెరలో)

సోదరులారా! విక్రమవర్మ యసహాయుఁడైయున్నాఁడు. ప్రతాపుని పక్షము బలమైనది. కాందిశీకవృత్తి వలదు. రారండు. (మఱి కొందఱు పౌరులు ప్రవేశింతురు - ఆబాలగోపాలము సంకులసమరమునకుఁ బ్రారంభింతురు.)

రాజు : (సపరివారుఁడై ప్రవేశించుచు)

మ. అవురా! ధర్మనిరూపణార్థమయి న్యాయస్థానముల్ లేవె? పూ
ర్వ విరోధంబుల శాంతిభంగ మొనరింపన్ బూని నారేల? ఉ
న్నవివేకంబును పెద్దలాకొలఁది శూన్యంబయ్యె నేమందు లో
కవిరుద్ధాచరణప్రమత్తు లగు టెంకన్ మాని వర్తింపరే.

(పౌరులు పరుగిడుదురు.) విక్రమవర్మా నీవు నా వెంటరమ్ము. ప్రతాపవర్మా! నీవు సాయంసమయమున నన్గలిసికొనుము. మీ యిరువురి కడనుండియుఁ బూచీపత్త్రము గైకొనవలయు. (విక్రమవర్మాదులతో నిష్క్రమించును. ప్రతాపవర్మ విజయవర్మలు మాత్రము నిల్చియుందురు.)

ప్రతాప : విజయా! నీవు క్షతగాత్రుఁడవు గాలేమగదా! చిర కాల స్తంభిక్కృతో భయకుటుంబవైరదవాగ్ని నేఁ డిట్లేమి కారణమున ఘోరాకృతిం గాంచినది?

విజయ : మామా! నే వచ్చుసరికి వారి సేవకులకును మన సేవకులకును గలహము పొసఁగినది. నేను వారించుచుంటిని. శూరసేనుం డేతేరి నిర్నిమిత్తంబుగఁ గయ్యముఁ బెంచెను.

ప్రతాపు : నాయనా! ఇందు జిరంజీవి చంద్రశేఖరుఁడు లేడు గదా?

విజయ : అయ్యో! అతని కిందుఁ బ్రమేయము లేదు.

ప్రతాప : విజయా! నేఁడు నీ బావమఱఁది నీకుఁ గాన్పించెనా?

విజయ : మామా! నేఁడు భాస్వంతుండు గగనభవన ప్రాగ్వాతాయన మార్గనిర్గత ప్రథమకిరణుఁ డగు సమయంబునఁ బురపశ్చిమభాగ ప్రాంత కాంతార ద్రుమచ్ఛాయాంతరవర్తియై యుండఁ గాంచితిని. ప్రబలరహస్యమనోభావ భారనిమిత్తాన్యపురుషసమాగమేచ్ఛావిముఖహృదయుం డైనట్లు కన్పట్ట వానిని డాయంజన సంకోచించుచుండ, నింతలో నా దృక్పథంబు నుండి నిర్గమించెను. నేను మరలి వచ్చితిని.

ప్రతాప : ఔను. కొలఁది దినంబులనుండియు నాతని ప్రవర్తనము చిత్రముగ నున్నది. సూర్యాస్తమయ మైన వెనుక క్షణమైన గృహంబున వసియింప నొల్లక పురవీథి కాసంచరణపరాయణుండై రాత్రిఁ గడపును. నిరాహార వ్రత మవలంబించినట్లున్నది. ఆ చెక్కుల నునుపు, నా నెమ్మేను తనుపు, నా మొగమ్మనునుపు, నా కన్నుల నినుపు, నా యునికి మనుపుఁ బరివర్తితంబు

లత్యే. ఉదయదంశుమాలికిరణప్రసార మెల్లని పులిపిల్ల గుహాంతర్భాగమున నక్కినట్టి రహస్యగృహాంతర్భాగమ్ముల గవాక్షబంధ మొనర్చి యస్వాభావిక యామినీ సమాశ్రితుడై యుండును. శరత్కాలనీరద శకలంబు విరిసిపోవున ట్లగుచున్న నెమ్మోమున జడలు నా దీర్ఘనిశ్వాస మరుత్పటలముం గన నాకు భయోత్పాత మగుచున్నది.

విజయ : మామా! ఇందులకుఁ గారణము నూహించితిరా ?

ప్రతాపు : ఏమో! నాకు గ్రాహ్యము కాలేదు. గ్రహింప నుత్సహింపనులేదు. అదిగో – చిరంజీవి యిటులనే వచ్చుచున్నాఁడు.

విజయ : మామా ! తాము నడచుచుండుఁడు. నే నాతనితో భాషించి మనోగత రహస్యగ్రహణమునకై ప్రయత్నించెదను.

ప్రతాప : సరి. (వడివడి నిష్క్రమించును.)

(మరియొకవైపునుండి చంద్రశేఖరుఁడు ప్రవేశించుచున్నాఁడు.)

విజయ : బావా ! సుప్రభాతము. ఆశ్చర్యకరము. ప్రకృతివిరుద్ధంబుగ సూర్యోదయముతోఁబాటు నేఁడు చంద్రోదయము గూడ నొనఁగూడె.

చంద్ర : విజయా! ఇంకను నుదయమేనా ? కాలచక్ర మెంతటి మందగతి ననుసరించుచున్నదోయీ !

విజయ : బావగారికి కాలమంత దీర్ఘతరముగాఁ గన్పట్టుటకు హేతు వెయ్యది?

చంద్ర : యుగము యామ మొనర్పఁగల్గిన వస్తువు లేమియే.

విజయ : నవీనప్రణయావేగప్రాబల్య మేమో ?

చంద్ర : కాదు. తద్వ్యతిరేకము.

విజయ : దురతిక్రమణీయవిరహోన్మాదమా?

చంద్ర : కాదు. తిరస్కారము.

విజయ : ఓహో ! ఆదిపేశల, యంతకర్కశ, బాహ్యామృదుల, యంతఃకఠోర, సమ్మోదప్రారంభ, దుఃఖపర్యవసాన- మోహదేవత యెంతచెడ్డది ? కాముకు లంధులు.

చంద్ర : అహా! ఈ నా మోహవ్యక్తి యెంత యంధమైనది? స్వాశయనిర్వాహణ మార్గగవేషణాప్రవీణ...సరి కాని. ఈ ప్రదేశము కవోష్ణరక్తబిందుసమ్మి

లితమై సంగ్రామరంగము ననుకరించుచున్నదేమి? ఓహో! నీవు వచింప నక్కఱలేదు. నేనే వింటిని - మన కీపూఁట భోజన మెక్కడ - ఓహో! ఈశ్వర విలాసము? శతృత్వమున కంటెను మిత్రత్వమే యిందుఁ బ్రియో జన కారి. అరరే; అసూయానిబిడీకృతప్రేమ-ప్రేమావృతాసూయాభావము-నిస్పృహాసక్తి- నైర్మల్యదీపితధూమము-జాడ్యారోగ్యము- జాగ్రత్సుషుప్తి-శైత్యవహ్నిజ్వాల - అలఘులఘుత్వముమాదిరి మత్ప్రణయ చరిత్ర - నవ్వు చుంటివా!

విజయ : నగవా? వగపా?

చంద్ర : సహృదయా! యెందువలన?

విజయ : సుహృద్వరహృదయతిరస్కృతికి.

చంద్ర : ఏమి ప్రయోజనము? ప్రణయైకోద్రేకప్రవర్తన మట్టిద. మద్ధృదయ కుహరానివార్యాశాంతిని త్వన్మైత్రీసహజానుభూతిజనితదుఃఖాతిరేకమున ద్విగుణీకృత మొనర్పకుము. జ్వలితదీర్ఘనిశ్వాసజ్వాలల ధూమాకృతి గోచ రించు ప్రేమ. పవిత్రితమై ప్రణయినీనయనాంతరాంగీకారనూత్నానలకణం బున నాసల హెచ్చించు నిస్పృహం జెందించి నేత్రాంబుపూరపారావార నిమగ్నుఁ నొనర్చినను నొనర్చు.

తుది కిది యంతయు గుప్తసౌఖ్యభ్రమోద్భూత తరుణపురుషోన్మాదము......... మంచిది. (పో నుద్యమించును)

విజయ : నేనును నిన్ను వెన్నంటి రానున్నాను.

చంద్ర : (విసుఁగు, నిస్పృహ, నిర్వేదము బయల్పడ) ఇష్! నాకు నేఁ దీటిపోయి తిని - నే నిక్కడలేను - ఇతఁడు చంద్రశేఖరుఁ డగునో, కాఁడో? అతఁ డెచ్చటనో కలఁడు.

విజయ : (చెయిఁ బట్టి) బావా? బతిమాలెదను. నీ వలపునకుఁ దావలంబైన యాపె యెవ్వతె?

చంద్ర : నిర్బంధమా?

విజయ : ప్రార్థన.

చంద్ర : చెప్పిరేమి తీఱవలయునా?

విజయ : తప్పదు.

చంద్రి : ఒక స్త్రీ.

విజయ : ఔనా?

చంద్రి : మఱియుఁ జక్కనిచుక్క.

విజయ : నీ కంటికి?

చంద్రి : చతుర్భువనదృష్టికిఁగూడ.

విజయ : ఇంతకు భవత్ప్రయుక్త మోహనాస్త్రమునకు నసాధ్య యైనదా?

చంద్ర: ఔనననుఁ - కాదనను. అనేక యువయోధప్రయుక్త ప్రమోహనాస్త్ర దుర్భేద్యమానవతీశీలకంచుకము సులభసాధ్యము కాదు. ధనాకర్షణ యోగ్య గాదు. ఆమె తోడనే యామె భాగ్య మున్నది. ఆమె కేవలము నవనవయౌవనోన్మీలనాసమసుషమాశ్రీభాండారసమేత, మత్ప్రాణదాత్రి. ఆమె యనుగ్రహనిగ్రహముల ననుసరించి మృతజీవత్వ జీవన్మృతత్వములు నాకు సిద్ధించును.

విజయ : బావా! అందని మ్రానిపండ్ల కఱ్ఱుసాఁచి దుర్భ్రాంతికి లోనగుచున్నావు. ఆమెను మఱచిపొమ్ము.

చంద్రి : అనుభవవిహీనా! మఱచిపొమ్మని యెంత సులువుగ బోధించితివి?

సీ. నిర్జితవార్షుకనీరదజాలౌఘ
కైశికబంధప్రకాశితంబు
కర్ణపరీవ్యాప్త కనదబ్జమాలాన
వాభిరామాక్షిసంశోభితంబు
తారుణ్యరుచిపల్లవారుణసందీప్త
బింబోష్ఠ సౌరభ్య విలసితంబు
ఘనకుచభారసంఘర్షకర్శితకృశ
మధ్యభావాభావ మానితంబు
త్రిజగదాకర్షకప్రభాదీప్తిఁ దనరు
మూర్తి యను వింట వెలిగెడు మోము నెలను

సురలు స్మితకౌముదీజాల సురభివాకఁ
జూఱఁగొనియె మచ్చిత్తచకోరకంబు.

ఇట్టిదానిని మఱువఁదగు నుపాయాంతరము నీ నోట తెలుపఁబడ నిమ్ము.

విజయ: బావా! అనఁదలఁచి యనియెదవు గాని కన్యాంతర మీ తెఱుంగవా? ప్రపంచమున సౌందర్యము గొడ్డువోయినదియా? భవదీయ దృగ్విసరాలోకమునకు స్వేచ్ఛఁ బ్రసాదింపుము. అనుభవశూన్యమైన విరాళికి లోనై రెంటికిం జెడిన రేవడ వయ్యెదవని శంకించుచున్నాను.

చంద్ర: ఓహో! ఎంత యనాలోచితముగ మాటాడితివి.

మ. నవమందారసుమప్రభూతమకరందం బాని, తత్పారవ
శ్యవిశేషంబున నన్యసూనమధుపానానిచ్ఛదిందిందిర
ప్రవరంబో యనఁ దత్సతీ విమలలావణ్యామృతాహార స
క్తి విరక్తిన్ గనఁబోదు మద్హృదయచక్రీశంబు సంలగ్నమై.

అన్యస్త్రీవిలోకనముచే నుపమానోపమేయములఁ గల్పించి ప్రాణేశ్వరీసౌందర్యాధిక్యమును దెల్లడించుట విరహద్విగుణీకరణకారణ మగుఁ గాని లాభదాయకము గాదు. ఎందులకు లెమ్ము. అనవసరప్రశంస లశాంతిహేతుభూతములు.

(నిష్క్రమింతురు.)

## ద్వితీయరంగము

### (విక్రమవర్మగృహము)

[విక్రమవర్మ, గోపాలవర్మ, ప్రవేశించుచున్నారు]

విక్రః రాకుమారా! రాజశాసనము నా కొక్కనికి మాత్రమే బాధకము కానేరదు. ఈ కట్టుబాట్లు ప్రతాపవర్మకును నాకును సమము. ఇంతతోఁ జిరతరామిత్రస్వభావములు పరివర్తితము కావచ్చును.

గోపాలః దేవా! పూర్వవైరము లెంత కాలము నిల్చును? వయోవృద్ధులగు మీర లిర్వురును శాంతిభంగవిముఖు లగుటలో నాకు సందియము లేదు. అది యట్లుండె మత్ప్రార్థన మేమైనది?

విక్రః గోపాలవర్మా! నా కితరసందేహము లెవ్వియు లేవు. నా తనయ కింకను బరిణయయోగ్యప్రాయము రాలేదు. ఆపె కిది పదునైదవ సంవత్సరము. మఱియొక వర్షమోర్చితివేని సర్వమును జక్కఁబడును.

గోపాలః దేవా! క్షమింపవలయు. దిన మొక్క మహాయుగసదృశము.

సీ. అనుదినాభ్యుదయ భవ్యానురాగప్రచ
లిత హృదయోద్వేగలీనబుద్ధి
త్రిజగదాకర్షణోద్దీప్తహేమలతావ
యోరూప చింతనోద్యోగగరిమ
విప్రలబ్ధ స్వాంత వేదనా విద్యోత
మాన వసంతసమాగమంబు
ప్రణయినీనిత్యానుభావనాలబ్ధతా
దాత్మ్యానుసంధానహార్దవృత్తి
నిండి హృదయంబు రేబవల్ నిష్ఠురమ్ము
చండ పుండ్రేక్షు కోదండ సమద ఘోష
చెవులు బ్రద్దలుగా నాత్మ చివికిపోయి
దూరు గనుచుంటి జీవన్మృతుండ నగుచు.

విక్రమ : (చిఱునగవుతో) నే నింకేమనఁగలుగుదును. వరహాలవిషయచర్చ నట్లుండ నిచ్చినను, హేమలతోద్దేశముఁగూడఁ గన్గొనవలయును గదా! శాశ్వత సుఖదుఃఖసమన్విత పరిణయబంధమునందుఁ దలిదండ్రుల యిష్టానిష్టముల కంటెను వధూవరుల యన్యోన్యాభిప్రాయసమ్మేళన మత్యవసరము. ఈ రాత్రి మధ్యాహ్నంబున నొక విందొసఁగ నిశ్చయించి, మన బంధుమిత్రాదుల కాహ్వాన మంప నుంటిని. నీవు కూడఁ దప్పక విందున కేతెంచి హేమలతాభిప్రాయముఁ దెలిసికొనుము. పోవుదము రమ్ము. (పోవుచు) సేవకా!

సేవకు : (ప్రవేశించి) చిత్తము. ఏమి సెలవు?

విక్రమ : నీ విప్పుడ పోయి యిందు లిఖింపఁబడిన వారి నెల్లర నీ రాత్రి విందున కాహ్వానింపుము.

(ఆహ్వానపత్రిక సేవకున కిచ్చి, గోపాలవర్మతో నిష్క్రమించును.)

సేవకు : (తనలో) బాగుగ నున్నది. షండునకు రంభాసంప్రాప్తి, జాత్యంధునకుఁ జంద్రోదయము, బధిరునకు శంఖారావము, నిరక్షరకుక్షికి నక్షరసముదాయము నిరుపయోగము. పల్లెవానికిఁ గుంచెయు, చిత్రకారునకు వలయు, నాకు నీ లిఖితమును సమానప్రయోజనకరములు. చదువువచ్చినవానికై వెదకవలయును. (పరిక్రమించును.)

(చంద్రశేఖరుఁడు, విజయవర్మ, యథావిధిఁ బ్రవేశింతురు.)

చంద్ర : విజయా!

ఉ. వేఁడెదఁ గేలు మోడ్చి, యవివేకమున న్విడనాడ కిట్లు వె
న్నాడకు, నా యభీష్టగమనప్రతిబంధకవృత్తిఁ బూని, చే
కూడెడి కార్యభంగమునకుం ననుఁ గర్తను జేయఁబోక కా
పాడు మభీష్టసిద్ధికి నుపాయము గల్గిన నిర్వచింపుమా.

(నడచుచుందురు.)

విజయ : బావా! ఇంతకు నీ ప్రయాణ మెటకు?

చంద్ర : అటకే.

విజయ : అనఁగ?

చంద్ర : ఆపె కడకు.

విజయ : ఇపు డెందులకు?

చంద్ర : ఎందులకా? కడకా పడఁద్రొక్కఁబడి కాఁపులు పడియుండి తృప్తిపడుటకు ఆ మదవతీ మృదుపదచిహ్నాంకితపవిత్రదేశరజోమూర్ధాభిషిక్తుండ నగుటకు. తెలిసినదియా ?

విజయ : ఆ! తెలిసినది, నీకుఁ బిచ్చి యెక్కుచున్నది.

చంద్ర : అయ్యో! నఖశిఖపర్యంత మితఃపూర్వమే వ్యాపించినది.

విజయ : యుక్తాయుక్తవివేకజ్ఞుఁడవుగదా?

చంద్ర : కనుకనే రోఁకలిఁ దలకుఁ జుట్టు మనుట లేదు.

విజయ : వట్టి చేలవు.

చంద్ర : చేలనైన నినువంటి యువకులకు నా గతి పట్టించియుందును.

విజయ : అర్థాంతరములఁ గల్పింపకుము.

సేవకు : (డాయం జని) అయ్యా! తాము చదువుకొంటిరా ?

చంద్ర : అహా! ఒకసారి యేమికర్మము! దినమునకు కోటిసారులు చదువుకొనుచున్నాను, నా నొసటి వ్రాఁత—

సేవకుడు: అయ్యది తమరు గ్రంథాపేక్షారహితముగనే చదువగలరు. వ్రాసినవ్రాఁత జూచి చదువఁగలరా యని యడుగుచున్నాను.

చంద్ర : ఆ - అక్షరములపై మనసు నిల్చెనేని, వాని జూడఁగల్గితినేని. భాష తెలిసెనేని-

సేవకు : హాస్యోక్తుల కెడములేదు. నన్ను క్షమించి తాము వ్రాయను జదువను నేర్చినవారైన, నిం దుదాహరింపఁబడిన వారి నామధేయము లెఱింగింపుడు. (ఆహ్వాన పత్రిక నందిచ్చును.)

చంద్ర : (చదువుచున్నాఁడు)

"శూరసేనుఁడు, గోపాలవర్మ, రామశర్మదాస్, హరినామసింగ్, నిధానసింగ్, నారాయణవర్మ, లక్ష్మణసింగ్, రణప్రతాప్, సంపత్సింగ్, మానసింగ్, సకుటుంబసపరివారముగ నేఁటిరాత్రి మద్గృహంబున జరుగనున్న విందునకు విచ్చేసి నన్నుఁ గృతార్థునిఁ జేయఁ బ్రార్థితులు."

......ఎవరిగృహంబునకు ?

సేవకు : నా యజమానుని భవనమునకు.

చంద్రి : వారి నామధేయ మెయ్యది యని నేను మొదటనే ప్రశ్నింపవలసినది.

సేవకు : ఇపుడు ప్రశ్నింపక రేమీ మనవిఁ జేసెదను. విక్రమవర్మగారి యాతిథ్య మందు కొనుటకు వారి గృహంబునకు రావలయును. తమరుకూడ, ప్రతాపవర్మిణులు కానిచో, దయచేసి యీ రాత్రి మిత్రదర్శనసంతోష మనుభవింపవచ్చును. సెలవిండు. (వడివడి నిష్క్రమించును.)

విజయ : మిత్రమా! ధన్యుఁడవు.

చంద్ర : కాదు. తదన్యుఁడను.

విజయ : అన్యుఁడవో, స్వీయుఁడవో, తదుపరి నిర్ణయింపఁబడును. మొత్తము మీఁద నీ విందున కేగిన, ప్రియాంగనాసందర్శన భాగ్య మనుభవింతువు. దర్శనధన్యత్వమైనఁ గనియెదవు.

చంద్రి : ఏమో! లక్ష్మణసింగు వచ్చినను బుత్రికతోఁగూడ రాఁగలఁడని యేమి నమ్మకము?

విజయ : రాకేమి – సకుటుంబముగ నాహ్వానించిన యాప్తబంధువుల యింటికిఁ బోవకుండ రాదు.

చంద్రి : అనాహూతంబుగఁ బరమిత్రగృహాభిగమనము – మృగరాడ్గహ్వర ప్రవేశ మట్టిది.

విజయ : (నవ్వుచు) బావా! నీ యీ దూరాలోచన నా కాశ్చర్య మగుచున్నది. ఇంతమాత్రము ప్రాపంచక పరిస్థితుల విచారింపఁగలుగునవస్థయం దుంటివేని కృతార్థులము. ప్రచ్ఛన్నవేషంబుల మన మీ విందునకు వెళ్లఁదగు. అట నశేపరూపాసుషమాశేముషీ విశేషంబులు సాక్షాత్కరించును. అంత కమలాబాయిపై భ్రాంతి నశించి భవద్విమలప్రణయార్ఘురి నురియొక దారిఁ బ్రవహింపఁగల దని విశ్వసించెదను.

చంద్ర : అదిగో! అచ్చటనే మనము పరస్పరవిరుద్ధాభిప్రాయుల మగుచున్నాము.

సీ. సర్వావనీచరాచరవస్తుసంభావ్య
విమల కళాకలాపములదాని
స్వప్నసమాగమ సమయ సాక్షాత్కార
కమనీయ దివ్యవిగ్రహము దాని

చిత్త పంకేరుహ సింహాసనాధ్యాసి
　　తానంగ దృక్కేళిమైన దాని
భువన సమ్మోహన మోహినీ సారూప్య
　　భవ్యాంగ సౌష్ఠవ ప్రభలదాని
ఇక్షుచాపనిర్యాతతీక్ష్ణైకకుసుమ
విశిఖజాతాగ్ని శోషితోదగ్రగంగ సాగరి
శేఖరప్రాణదాన సంజీవనీల
తాభతనులత మఱచు విధం బదెట్లు?

ఏది యుక్తమైనను నిన్నుఁ గాదనఁజాల. ఈ రాత్రి విందునకు మాధవవర్మతోఁ గలసి ప్రచ్ఛన్న వేషంబునఁ బోయివత్తము.

(నిష్క్రమించుచున్నారు.)

## తృతీయరంగము.

[విక్రమవర్మ గృహము - విందు]

[కొందరు పురుషులు, స్త్రీలు ప్రవేశింతురు]

విక్రమ : (సతీయుతముగఁ బ్రవేశించుచు) ఆర్యులారా! దయచేసి యుచితాసనము లలంకరింపుడు. లోపాలోపములఁ బరిగణింపక మన్నింపవలయును. (సతి నుద్దేశించి) సతీ! అమ్మాయి హేమలత రాలేదేమి?

తారాబా : రాకేమి? అదిగో! తోడివారిం గూడి మాటాడుచు నిటులనే వచ్చుచున్నది.

[హేమలత యొక పక్కనుండియుఁ బరిచ్ఛన్న వేషములతో జంద్రశేఖరుఁడు, విజయవర్మ, మాధవవర్మ మరియొక వైపు నుండియుఁ బ్రవేశింతురు.]

విక్ర : అభ్యాగతులకు సుస్వాగతము, పీఠము లలంకరింపుడు.

(అతిథు లెల్ల రాసీనులై భోజనములు చేయుచున్నారు).

చంద్ర: (ముం దమర్పఁబడిన క్షీరపాత్రముఁ జేఁబూని హేమలతా సందర్శనమున నిశ్చేష్టుండై, వడ్డించువానితో జనాంతికముగ) సేవకా! అయ్యదృశ్యవలగ్న యే మాతాపితల దివ్యగర్భశుక్తిముక్తాఫల మోయి! (తర్జనితో హేమలతను నిర్దేశించును)

సేవకు : అయ్యా! క్షమింపవలయు. నే నీ గృహంబునకుఁ గొ్రత్త. నేఁడీ పాచకకృత్యమునకే వచ్చియుంటిని. ఆమె యెవ్వరో యెఱుంగను. (యథేచ్ఛఁ జనుచున్నాఁడు)

చంద్ర : (పీఠమునుండి లేచి) బావా! విజయా! మజ్జన్మచరితార్థతకుఁ గారణమవైతివి. చూడు, చూడు. మానవనాకలోకాలభ్యవిద్యుల్లతావిగ్రహయైన తత్కాంతాలలామ నవలోకింపుము.

సీ. కచభారమా! యది కామానుసంధాన
సాంద్రాంధకారసంస్థాన మేమొ?
భ్రూయుగ్మమా! యది పుష్పాస్త్ర హస్తసం
స్థగితపుండ్రేక్షుకోదండ మేమొ?
దృగ్జాలమా! యది త్రిభువనక్షోభణ
సూనాస్త్రశస్త్రసంతాన మేమొ?
నెమ్మొగమా! యది నిష్కళంక కళాప్రి
పూర్ణసుధాకరమూర్తి యేమొ?
ప్రకృతివస్తు సౌందర్య సర్వస్వసంగ్ర
హణ వినిర్మాణ విమల సర్వాంగ సౌష్ఠ
వ ప్రకాశిత లావణ్యభాగ్యసీమ
దర్శనప్రాప్తి జన్మసార్థకతఁ గంటి.

(తదేకదృష్టి హేమలతం బరీక్షించుచు) విజయా! విద్యుద్దీపోద్దీప్తమై, శిరంధ్ర పినీల మేఘచ్ఛాయా వ్యక్తి కర్ణాభరణ మాణిక్యశ్రేష్ఠము ననుక రించుచు, సాంద్రాంధకారచ్ఛటా యామినీ కామినీ కపోలఫలక లంబి చంద్రిమః కాంతిప్రభాపుంజ మనఁ బ్రకాశించుచున్నది. ఆహా! మానవ మాతోత్పయోగాతీతసుషమావిశేషయై, మర్త్యలోకానుభవారోగ్య యయ్యె. తత్సామాన్య మానవతీమండల మధ్యాంతర్వర్తిని యగు నయ్యభి నవసుధాకరబింబము వాయసనమూహపరీవృతమరాళరాజమై యొప్పెను. మద్విన్మల ప్రణయైక రసప్రవాహ మితఃపూర్వ మొక పథం బున నడిచెనా? తజ్జీవితవిస్మృతి ప్రాప్తించుచున్నది. దృగ్విసరమా! నేఁటి రాత్రియే సృష్టికర్తృ నిర్మిత నిశ్చయ సౌందర్యామృతాస్వాదనా లోల వైతివి. కానిమ్ము. (తనలో) అయ్యతివ గమనవిధానముఁ గన్పెట్టి యుండి స్పర్శానందమున మత్కరతినహస్తమునకు ధన్యత్వ మాపాదించెదను.

శూర: (జనాంతికముగ విక్రమవర్మతో)

శా. సందేహింపక చంద్రశేఖరుఁడు ప్రచ్ఛన్నాకృతిఁ దా సుహృ
ద్బృందంబుల్ గొని వచ్చియుండెను మదోద్రేకంబు భంజింతు, సా

నందస్వాంతుఁడవై కనుంగొనఁగ నాజ్ఞాపింపు కర్తవ్య, మీ
సందర్భంబున మిన్నకున్న మనపక్ష మోడినట్లేఁగదా.

(సంరంభముఁ జూపుచున్నాఁడు)

విక్రి : చాలుఁజాలు. అప్రస్తుత ప్రశంసలు - అనవసర ప్రమేయములు - అకాండ తాండవములు - వృథావైరసంరంభములు, విరమింపుము. చంద్రశేఖరుఁడు బుద్ధిమంతుఁడు, నిరపాయుఁడు, ప్రజానురంజకుఁడు. చూచియుఁ జూడనియట్లు పోవనిమ్ము. మీఁదుమిక్కిలి సరళస్వభావంబున వైర మెంచక మన గృహంబున నడుగిడినందులకు సంతసింపుము.

శూర : అయ్యయ్యో! అట్లనియెదరేమి? పౌరుషవిహీనంబును లజ్జాకరంబును నగు సంభాషణము తమనోట వెల్వడునని నే ననుకొనలేదు. నా హృదయమునకుఁ జిచ్చు ముట్టించినట్లున్నది. బలవచ్ఛత్రువు మన వంటయింటి కుందేలైనయప్పు డవకాశమును బోఁగొట్టుకొనుట వెఱ్ఱితనము. నన్ను వారింపవలదు. సేవకా! ఏదీ! మత్కరవాలము. వీనిని నికృత్తకంఠుఁ గావించి ప్రత్యర్థి కవోష్ణరుధిరధారాత్రివాహిని నభ్యాగతుల సంతృప్తి నొందించెదను.

విక్రి : (గుడ్లెఱ్ఱఁజేసి) ఏమిది! నీకుఁ గాదా చెప్పినది? ఇచ్చట నీ పెత్తనమే మున్నది? ఈ గృహయాజమాన్యము నీయదియా? నాయదియా? అవమానమైన నాకా? నీకా? వాగ్వ్యయమునకుఁ గడంగకుము. అవతలకుఁ జనుము. సకలబంధుమిత్ర సందోహసమాగమ సంతోషైక సాత్త్వికరంగస్థల మొక్కసారిగ రక్తపాతసమన్వితపశుబలప్రదర్శనశాలగా మార్పఁజాలను. పొమ్మవలను.

శూర : (కుపితుఁడై) మీకు నచ్చిన నచ్చుఁగాక. నాబోఁటి శూరునకు మాత్రము కట్టెదుట నా గర్భశాత్రవుం డుంట దుర్భరము. ఇచ్చోట నిలువం జనదు.

(వడి వడి నిష్క్రమించును.)

(అభ్యాగతులు భోజనానంతరసరససల్లాపక్రియల బ్రొద్దుఁ బుచ్చుచుందురు. హేమలతా చంద్రశేఖరు లన్యోన్యావలోకనముల డాయఁ జనుదురు.)

చంద్ర : (హేమలతా సన్నిధాన పారవశ్యముచే క్షీరపాత్ర జాఱవిడచును).

హేమ : మహాశయా! మరికొన్ని క్షీరములఁ గైకొనుఁడు (అందిచ్చును.)

చంద్ర : (పుచ్చుకొనునపుడు హస్తము స్పృశించి తత్సుఖానుభవతన్మయుఁడై)

ఆకారనిర్జితస్వస్తరుణీమణీ! మన్నింపుము. భవన్మృదుల శిరీషకుసుమపేశల పవిత్రీకరతలమునకు, మత్కర్కశ హస్తసంస్పర్శమున నపకృతి నొనర్చు యఘుసమన్వితుఁడ నైతిని. ప్రణయతీర్థయాత్రాఫల మగు సుకుమారచుంబన ప్రక్రియచేత మదోష్ఠయుగ్మము తత్పాపోపశమనము గావించుఁగాక!

హేమ : (మందస్మితయై) ఆర్యా! నిర్హేతుకముగ నర్హాకృత్యతత్పర మైన త్వత్పాణి తలమును నిరసింపకుము. స్పర్శానుభోగమునకుఁగాదే కరచరణాది నిర్మాణముఁ గావింపఁబడినది? మరియు నన్యోన్యకరస్పర్శనచుంబనములు ప్రణయతైర్థికవ్రతవిధులు.

చంద్ర : (నగుమొగంబున) పాణితలస్పర్శనచుంబన సౌఖ్యాతిశయము లేటికి? అంతర తీర్థస్నాతు లగు మునిజనులు మాత్రము తైర్థికులవలె నోష్ఠసంయుతులు గారో?

హేమ : తీర్థసేవాలాలస మానసా? వారి యోష్ఠద్వంద్వములు జగత్కల్యాణ సంధాన నైవప్రార్థనోపయోగార్థ మున్నవి సుమా?

చంద్ర : భాగ్యైకనిధానమా? ఔను. కనుకనే ప్రార్థించుచున్నాను. మత్కామ్య ప్రసాదకల్యాణసౌభాగ్యసంయోగభారవహ వగుచుంటివి.

హేమ : చమత్కారవచఃప్రచారా? మునిజనులు సులభసంచలితులుగారు.

చంద్ర : సత్యము. భవత్సంచలన మనవసరము. మత్తపఃప్రభావమే సంకల్పసిద్ధి మార్గాన్వేషణ యోగ్యతాప్రవీణ యగుంగాక.

(దగ్గఱి చుంబించును)

హేమ : పుణ్యపురుషా! న్యాయమా? చుంబన మార్గమున నీ వ్యతిక్రమము నా కాపాదింతువా?

చంద్ర : ప్రమాదము; దేవీ! నేను నీయెడ నట్టి దురాగత మొనర్పను. నా పాప భారము నేనే యనుభవించెదను. ఇటు తెమ్ము:

(తిరిగి చుంబించును)

హేమ : హాయి.........

(తెరలో: హేమలతా! నీతల్లిగారు ని న్నొకసారి వచ్చిపొమ్మనుచున్నారు.)

[మహాలక్ష్మి యను దాది ప్రవేశించుచున్నది]

హేమ : ఆ-వచ్చితిని. (చంద్రశేఖరుని దృగ్జాలబద్ధు నొనర్చి నిష్క్రమించును).

చంద్ర : (జనాంతికముగా) హా! చెడితిని. మత్ప్రాణము లేచి పోయినది. ఓహో!

సీ. అనవద్య వైదుషీ వినయసమన్విత
సంభాషణోచితచతురిమంబు
సద్వంశగౌరవసౌందర్య శేముషీ
కలితసచ్ఛీలప్రకాశనంబు
తరుణవయోదీప్తి దమనసద్భావనసం
దీప్తసాధ్వీత్వవిధిజ్ఞ మహిమ
సాత్త్వికశృంగార సారావహిత్థావి
సర్పిత గాంభీర్య చారురేఖ
ప్రేక్షణీయమై నేఁడు మూర్తిభవించి
తాను మచ్చిత్తవిత్తంబుఁ దస్కరించె
నన్నిమేషదపూర్వజనిత విద్యుల్లతాంగి
యీమె పుట్టుపూర్వోత్తర మెట్టి దొక్కొ.

ఆపెఁ దోడ్కొని పో నేతెంచిన యీ వృద్ధాంగన నడిగి తెలిసికొనియెద.
(ప్రకాశముగా దాదితో) అవ్వా...

మహా : (మాట కడ్డమై) అవ్వా! తవ్వా! యనియెదవు. ఎందులకు తాతా? నా కేమి నీవు బొడ్డుఁగోసి పేరిడితివా? మహాలక్ష్మి యనలేవా? తలనెఱిసిన వయసు నెఱిసినదా? కాలమహిమ. బాల నెఱు పెఱుఁగవా? ఇంతవఱకు నేను కాలుఁతీపు, చెయినొప్పియు నెఱుఁగను. పంటిక్రింది పచ్చిపోఁక పదు నాలు చెక్క లగును. ఇంతకంటెను నీ పడుచుఁదనము మళ్ళఁబడినదా యేమి? ఎవనినోట వినఁబోయినను నిదియేమాట. నాతోడివార లనేకు లింకను గని పెంచుటలేదా? దేవుఁడు తిన్నగ జూడలేదుగాని (భర్తృమరణము జ్ఞప్తికిఁ దెచ్చుకొని దుఃఖించుచు) ఆయన యాయుర్దాయము గట్టిదైనచో, మీరు మీరు నన్నిట్లు ముసలి దని, ముక్కదని యొకసక్కెము లాడెదరా?

చంద్ర : (నవ్వు నాపుకొని) మహాలక్ష్మమ్మా—

మహా: అమ్మా, వద్దు. కామ్మా వద్దు. మహాలక్ష్మి యనిన మడిమాన్యము లిచ్చినట్లు. మా కెందులకు గౌరవాలు. రాజ్యాలా! రత్నాలా? గుడ్డిగవ్వైనఁ జేయని గర్భదరిద్రులము.

చంద్ర : మహాలక్ష్మీ! క్షమింపుము.

మహా : అదిగో! అదియే వద్దనునది. నోటమాట. నొసట వెక్కిరింత నాకు గిట్టదు. ముక్కు లమ్ముకొని పొట్టఁబోసికొను నన్ను క్షమింపుమని మీరు కోరుట లెస్సయేనా? నన్ను నవ్వులాటకుఁ బట్టించకండి, హేళన పలుచనఁ జేయకండి, నా దారి నన్నుఁ బోనియ్యండి. (పోబోవును)

చంద్ర : (పోనీయక) కాదు, కాదు. నన్నట్లు వేధింపకు. నేను నీ వనుకొనునట్లు కొంటె కోణంగిని గాను. నా వెక్కిరింత వాక్సహాయ మొనర్పవలయును. ఆ విప్రుడు తోడ్కొని పోవచ్చిన యాపె యెవతె? ఆమె తల్లి యెవరు? నీకును నీ యింటివారికిఁ గల సంబంధమేమిటి? వచించి పుణ్యముఁ గట్టికొనుము.

మహా : హేమలతను గుడి యెడమ భేదము లేకుండఁ బెంచి పెద్దదానిఁ జేసిన దానిని నన్నెఱుంగవా? హేమలత నెఱింగినవాఁడవు తల్లి నెఱుంగవా? తారాబాయినిఁ దెలియనివాడును, విక్రమవర్మ కుటుంబ మెఱుఁగని వ్యక్తియు విశాలపురిఁ గల్గునా?

చంద్ర : (ఆత్మగతమున) హాతోస్మి! వైరిబంధువర్గమునకుఁ జెందిన దైనందులకే కమల ప్రేమింప వెనుక ముందాడిన నేను ప్రతిపక్షి తనయను మోహించుట ముల్లుఁ జెటికి కొట్టుడఁచుకొనినట్లయినది. కట్టా! దైవానుగ్రహ మిట్లున్నది. క్రీనీడలైన మేలు కీళ్ళు ధైర్యాధైర్యముల వెనుక ముందాడవు.

చ. ప్రథితవిరోధిరాడ్తనయ పాణిపరిగ్రహణానురక్తిమై
వ్యథితమనోరథార్తిని హతాశుఁడనైతిని దుర్నివారదు
ర్విధిపరిపాకపంకిలదురీహితుడన్ నడిమైన నోర్చి ప్రా
ణధనము లొడ్డియేనియుఁ గొనంగల హేమలతానురాగముల్.

# ప్రణయాదర్శము

(నేపథ్యమున)

నిద్రావేళ నతిక్రమింపఁజేసి శ్రమనొసంగినందుల కభ్యాగతుల క్షమింపవేఁడి, స్వగృహోన్ముఖు లగుటకుఁ బ్రయాణసౌకర్యము లమర్పఁబడిన వని విన్నవించుచున్నాము. త్వరపడవలయు.

చంద్ర : (ఆలకించి) అంతయు నిరాకారము, నిస్తేజము. ఈ శూన్యమ్మున నిరాధారుఁడనై, ప్రారబ్ధపారావారోత్తుంగాభంగభంగుర తరంగరింగణసదృశ సంకల్పుఁడనైతిని. బంధురాంధకార నిశాసమయంబున సుమార్గాన్వేషణాసక్తుఁడైన పాంథునకు ప్రకృతిదేవీహస్తవిన్యస్తనక్షత్రకరదీపిక యట్లు, హతాశుఁడనగు నాకుఁ దత్కాంతాప్రణయసంభాషణమే పంచప్రాణములు నిల్పి బ్రదికింపవలయును. నా జీవితము దారము తెగి యొకదారిగన నేరక యాలక్ష్యగమ్యాంతరాళమున ఝుంఝూనిలవేగంబునఁ గొట్టికొని పోవు గాలిపటము సామ్యముఁ బొందుచున్నది. సత్సతీ! భూనభోంతరాళవ్యాప్తజగన్మోహన విశ్వరూప వగు నిన్నుఁ జూచుచుఁ జూడలేకున్నాను.

(దిక్కులు పరికించును)

విజయ : బావా! ఆమె యిందు లేదు. ఎందులకు వెదకెదవు?

మాధ : మిత్రమా! తదేకానిమిషదృష్టి నిందనుకఁ జూచినది చాలదా?

చంద్రి : తనివి తీఱలేదు. మన సుఱ్ఱూఁత లూఁగుచున్నది. మనసిజుం డఱ్ఱాఁకలం బెట్టుచున్నాఁడు.

మాధ : (నగుచు) నెయ్యుఁడా? ఇపుడు తహతహంబడి నిష్ప్రయోజనము.

విజయ : బావా! మొదటనే తృప్తిగా దర్శింపక పోయితి వేమి?

చంద్ర : దృష్టిదోషబాధిత యగునని.

మాధవ : ఇది పుక్కిటిపురాణము.

చంద్రి : నెచ్చెలీ! అట్లనకుము. పుట్టించునాఁడు సృష్టికర్త దివ్యదృష్టిపడి చపలాక్షియై, మందయాన యయ్యెఁగదా!

విజయ : (నవ్వుచు) బావా! రావలసిన లోపంబులు రానేవచ్చెను. ఇఁక నీవు చూచిన నేమి రాఁగలవు.

చంద్ర : ఏమి రాఁగలవా? వెన్నడుము సున్న కావచ్చును. ఒకవేళ భీరువైనఁ గాకూడదా? ఇంతయేల? వట్టి గోల యగును. నీ కట్లు తెలియును?

విజయ : వెట్టి వేయివిధములు. రారమ్ము.

మాధవ : పాండిత్యప్రకర్షల కేమి! నిద్రాసమయమైనది. బయల్వెడలుము.

(మాధవవర్మ, విజయవర్మలు చెరియొక చెయిఁ బట్టి తీసికొని పోవుదురు.)
దాది తప్ప తదితరు లెల్లరు నిష్క్రమింతురు.)

హేమ : (ప్రవేశించుచు)

మ. అది యేలాఁటి విచిత్రమో గద దురూహ్యంబయ్యెఁ బ్రచ్ఛన్నవే
షదిదృక్షాగత సూనబాణ మధుపజ్యాముక్త తీక్ష్ణాస్త్ర మో
హదవాగ్నిప్రభ లిట్లు వర్తిలునె? ఆహా దైవసంకల్ప మ
య్యది కాఁబోలు, వెలార్చు హేమలతభాగ్యాభాగ్యముల్ నేటితో.

దాదీ! దాదీ! దృక్పథం బతిక్రమించుచున్నాఁడు. త్వరపడుము. త్వరపడుము.

మహా : అయ్యయ్యో! హేమలతా! తబ్బిబ్బులాడుచున్నావు. నీయభిప్రాయము బోధపడలేదు.

హేమ : (నిర్దేశించుచు) చూడు! ఆ పోవుచున్న మువ్వురిలో వెనుక నడచుచున్న తరుణవయస్కునిచరిత్ర కావలయు. వివాహితుఁడని తేలినచో మదుద్వాహోత్సవము శ్మశానవాటికయందు స్థిరపడును.

మహా: (నవ్వుచు) అతని యుదంతమున కంత రాద్ధాంతసిద్ధాంతముఁ జేయుచుంటివి? ఆయన పేరు చంద్రశేఖరుఁడు, ప్రతాపవర్మైకసుతుఁడు; నీ కుటుంబమునకు బలవద్విరోధి.

హేమ : (నిట్టూర్చి) కట్టా! ఏమనఁ గల్గుదును? ప్రతాపవిక్రమవర్మవంశయుగ్మ సముద్రమథనోద్భూత వైరబడబానలాంతర్భాగమునఁ బ్రణయైకామృత భాండము గోచరించుచున్నది. అపరిచిత పరిచయమునకుఁ ద్వరపడితిని. యథార్థ చరిత్రగ్రహణమున కాలసించితిని. "గతస్య శోచనా నాస్తి."

మహా : ఏమీ! ఏమనుచున్నావు?

హేమ : ఏమనుచున్నానా? విను.

తే. గీ. మన్మనఃక్షేత్రసీమ సమయ మెఱింగి
ప్రియుఁడు నాటిన ప్రణయైకబీజ మింకఁ
గలితదోహదప్రక్రియ మొలకరించి
వృద్ధిఁ బొందఁ గాముఁ డనుగ్రహించుఁగాక.

(నిష్క్రమించును.)

మహా : హా—సర్వనాశనమునకు వచ్చినది. (తోడనే నిష్క్రమించును.)

## చతుర్థరంగము

[విక్రమవర్మ గృహము ముంగిట వీథి]

చంద్రి : (పరుగుతోఁ బ్రవేశించుచు) నెచ్చెలులారా! నను వారింప వలదని ప్రార్థించెదను. మరియుఁ గారింపఁ దగదని యర్థించెదను. (పోఁబోవును)

(వెంటనంటి విజయవర్మ, మాధవవర్మ ప్రవేశింతురు.)

మాధ :

తోటకవృత్తము:

ప్రతిపక్షుల నమ్ము టపాయము, దు
ర్గతి హేతువు, దుష్ప్రథ కారణ మే
బతిమాలెద, మానుము పంతము, మూ
ర్ఖతఁ బూనకు కామవికారమునన్.

(అడ్డగించును)

చంద్రి: (తప్పుకొనిపోఁజూచుచు) మాధవవర్మా! చనవునకును మితిగలదు. దూరమున నుండుము. కృతనిశ్చయుఁడను. నా ప్రసక్తి నీ కనవసరము.

మ. మరణప్రాప్తికి నైన నెన్నఁగ, నా మార్గానఁ బోనిమ్ము త
త్తరుణీదోర్లతికోపగూహననిశాంతిప్రోజ్జ్వలత్సౌరభా
కరవృత్తస్తనమంజరీ శయనభోగశ్రీసమేతామృతా
ధరపానాధికమాద్యదాత్మసముదాత్తస్వాస్థ్య మాసించెదన్.

(పోఁబోవును)

మాధ : (బలువఁబట్టికొని) మిత్రమా! గోతఁ బడుచున్నావు.

చంద్రి : బాధపడుచున్నాను.

విజయ : పిదపఁ బరితపింతువు.

చంద్రి : పరితాపోపశాంతికే త్వరపడుచుంటివి.

మాధ : దూరాలోచన మానుచుంటివి.

చంద్రి : దూరాలోచనఁ జేయుచుంటిని.

విజయ : పొరపడుచుంటివి.

చంద్రి : త్వరపడుచుంటిరి (నడచుచుండును.)

మాధ : పోయిన ముప్పుగుసుమ్మా! (అడ్డగించును.)

చంద్ర : పోవకతప్పదు పొమ్మా! (విదల్చుకొని పోవుచుండును.)

విజయ : మిత్రుఁడా! నిలు నిలు (పట్టుకొనఁ బ్రయత్నించును.)

చంద్ర : హితుఁడా! వలదు వలదు. (తప్పించుకొని నిష్క్రమించును.)

మాధ : చంద్రశేఖరా! చంద్రశేఖరా! ఏఁడీ! ఏఁడీ!

విజయ : బావా! ఎక్కడ? ఎక్కడ బావా?

(దిశల వెదకుచు నిష్క్రమింతురు.)

[విక్రమవర్మగృహప్రాంగణమునఁ జంద్రశేఖరుఁడు ప్రవేశించును]

చంద్ర : ఈ ప్రాకారము లంఘించి గృహావరణముఁ బ్రవేశించెదను. ప్రణయ ప్రార్థనావసరముల వివిధసాధనములు నిగ్రుప్తములు.

(పరిక్రమించును. ఉద్యానవనాంతర సౌధరాజము కన్పట్టును.)

చంద్ర : ఆహా! ఈ విహారారామరామణీయక మాత్మీయభావిసుఖజీవనమున కువ్విళ్ళూరించుచు మిఁదు మిక్కిలి తన్మయత్వహేతు వగుచున్నది. సంకల్పభవుఁడు సంధానకర్తృత్వ చాతుర్యము యథావిధి నిర్వహించినచో వహ్వా! అప్పుడు– (వనముఁ గలయఁ జరించుచు)

సీ. మలయసమీరకుమారశైత్యప్రచా
రోపలాలిత తనుద్యుతులతోడ
అన్యోన్యబాహులతావృతదేహైక
సమధికోత్సాహచిత్తములతోడ
సమరతిసౌఖ్యవిస్ఫారితప్రణయని
మీలితనేత్రయుగ్మలతోడ
కేళీవికంపితకేశాభరణవస్త్ర
లబ్ధైకమూర్తి చెల్వములతోడ
నిత్యోపవనస్థమందారవృక్షపాద
మల్లికావల్లికాంతర మానితేందు
కాంత వేదికా నికట నితాంతనవతృ
ణాంకురస్థలి విహరింతు మహరహంబు.

(అగ్ని) గర్భస్థశిశు నామకరణపరత్వ మజ్ఞానుల కుండఁదగినది.

(గవాక్షమునుండి హేమలత చూపట్టును)

చంద్ర : (సౌధగవాక్షముపై దృష్టి సారించి) అత్యద్భుతము. కళాపూర్ణుడు, కాల కాలంబాల సౌధప్రాగ్గవాక్షజాలపథాంతరనిర్గమనా కాలబాలారుణోదయ కిరణదీప్తి మన్మనోభ్రమణ కారణం బయ్యెడిని. అదిగో! నా పంచప్రాణ రూపిణి, వామహస్త విన్యస్తమృదులకపోలఫలకయై, యంసాలంబిత కబరీ కర్ణాభరణ దేదీప్యమానయై, మనఃక్లేశభారసూచన తీక్ష్ణదీర్ఘనిశ్వాస కృశాంగియై, యొక్కొకసారి నైసర్గిక మధురావ్యక్తస్వనమున నేమేమియో పలవరించుచున్నది. (వినుట సభినయించును)

హేమ : హా!. చంద్ర - శే - ఖ - రా! (నిట్టూర్చి) చంద్ర - శేఖరా!

చంద్ర : (ఆత్మగతమున)

గీ. చంద్రశేఖరదర్శనాసక్తవైన
దత్సమాగమ మది యసాధ్యంబు గాదు
ప్రణయ పరిణత నిశ్చలభావదృష్టి
నెందు వెదకిన నాతం డందందె కలండు.

జగజ్జేగీయమానలోచనతారకాద్వితయద్యుతులం గ్రాసెసి, తేజఃపుంజములం బ్రస రించు నా కపోలయుగస్పర్శానుభవజ్ఞుడ నగుటకుం దుద కాపె వామ హస్తగతమైన రుమాలు నైనం గానైతిని.

హేమ : హా! సౌందర్య శయశ్శేముషీవిద్యావినయ సంపద్భాండారమా!

చంద్ర : (ఆత్మగతము) ఆహా! మరలం గలవాణీకలస్వనమాధురీరసాస్వాదన తుందిలమాననేందిందిరుడ నయ్యెద. (చెవి యొగ్గి వినుచు) సిరసపత్ర విలాననవినోదనాలోలమలయపవనాంకురమా! మలయజగంధి యవ్యక్త స్వరశ్రవణాంతరాయ మాచరింపక యొక్కింత నీ పోకల్లం జాలింపుము. (చేసంజ్ఞ జేయును.)

హేమ :

సీ. భవదీయవిగ్రహపౌష్టిమ ద్భావనా
సృష్టి సర్వం బావరించుకొనియె
వంశక్రమాగత వైరభావంబుల
దూరీకృత మొనర్ప భారపడుము

కల్లిదంట్రులు చిరశాస్త్రపూరిత హిత
సిద్ధాంతములఁ జెవిఁ జేర్చవలదు
ప్రీతిర క్తనాళంబు రాగరస సమృద్ధిఁ
గనుటఁ బరీక్షింపు తనువుఁ జీల్చి
మనల నిర్మించునాఁడె దంపతులు గాఁగ
ఫాలతలములఁ దీరిచి వ్రాసె బ్రహ్మ
యందులకు సాక్ష్య మీనాఁటి యప్రయత్న
చుంబనప్రతిచుంబనాస్తోకసుఖము.

చంద్రి : (ఆత్మగతము) ఇది యీమె స్వయముగ వ్రాసిన పద్యము కాఁబలయు. సమతాది గుణములుగాని, పదబంధసౌకుమార్యాదులుగాని లేక పోయినను మహోత్సుకముగా నడిచిన యిది కవయిత్రిభావోద్రేకమును బట్టియిచ్చు చున్నట్లున్నది కాముకులకుఁ గవులకు భావాధీనతలో సమానావస్థయేకదా!

హేమ : (నిట్టూర్చి) దైవమా! మా యిరువురియం దొకరమైనను విశ్వకర్మ ప్రత్యాపవర్మల కుటుంబములకుఁ జెందనివాండ్రమై యుండి యుండఁ గూడదా? అయిన నేమి? ప్రియా! మిత్రప్రణయపరిగ్రహణదృఢప్రతిజ్ఞా బద్ధుఁడ వగుము. తండ్రిని నిరాకరించెదను. నిజాభిధానముఁ ద్యజించెదను.

చంద్రి : (ఆత్మగతము) ఇంకను జాటుమాటు లేల? బైటఁ బడెదను.

హేమ : ప్రాణపతీ! పేరునం దేమున్నది. అది వ్యక్త్యవయవముల కిద్దానికిని జెంది నది గాదు. పేరు మారినను నాతిపోవునదిలేదు. చాంపేయమునకు మరియొక నామ మిడిన నైజసుగంధంబుల వెదజల్లక మానదు. మదిష్టదైవతమా! పేరుఁ ద్యజించితివేని నీకొఱకు నా సర్వస్వమును సమర్పించెదను.

చంద్రి : సందేహమా! ప్రేమైకస్వరూపిణీ! నామాంతరుఁడ నగుటఁ గాదు. నీకై మతాంతరుఁడ నైన నయ్యెదను. దేహాంతరుఁడఁ గూడఁ గాఁగలను.

హేమ : (ఆశ్చర్యచకితయై) ఎవరు వారు? మదేకాంతభంగ మొనర్చ సాహసించి నారు?

చంద్రి : అప్రయత్నలబ్ధ స్వప్తరుణీలలామమా! ఎవఁడ నని వాకొనఁగలను? నా వంశాభిధానముగాని నా నామధేయముగాని నీ కనిష్టదాయక మగుటయే గాక నిన్నుఁ బట్టి నాకుఁగూడ వచింపరాని వయ్యెను.

హేమ: (ఆత్మగతమున) నా జన్మమునం దిదివఱ కొకపర్యాయము మాత్రము వినియున్న యీ కంఠస్వరము చిరపరిచిత మట్లు కర్ణపుటములఁ బ్రతిధ్వనించుచున్నది. (ప్రకాశముగా) పాంథా! ప్రతాపవర్మైకసుతుడవు గావా! నీ నామధేయము చంద్రశేఖరుఁడే గదా?

చంద్ర: ఉభయంబును గృత్రిమంబులు. "ప్రేయనిధి" యని నీవు నా కిపుడు నామకరణ మొనర్పుము.

హేమ: ప్రణయైకనిధానమా! నీ వీ యున్నతప్రాకారోల్లంఘనక్రియయం దెట్లు కృతకృత్యుఁడ వైతివి.

చంద్ర: ప్రియా! మోహపక్షవిక్షేపంబున హిమవత్పర్వతశిఖరాగ్రంబుల దాఁటి పోవఁగలను. పారావారము నధిగమింపఁగలను. ఉత్తరధ్రువమునుండి దక్షిణధ్రువమున కవలీల లంఘింపఁగలను. అసాధ్య ముండ నేరదు. ప్రణయాభిగమనమునకు రాకట్టడము లడ్డుకట్టలా?

హేమ: మత్ప్రాణపరిత్రాతా! నిన్నిట్టి సమయంబునఁ జూచిన నీర్ష్యాగ్రస్తులను ఖడ్గమాత్రోపజీవులు నగు నుదాత్తబంధువులు నాకు దక్కనిత్తురా?

చంద్ర: శక్తిదానా! మద్విమతశతసునిశితఖడ్గప్రహారోపద్రవముకంటెను నీ దృక్పాత మపాయకరము. భవదీయనిర్మలప్రణయస్పృక్కిలీముఖప్రాకారసురక్షితుఁడనైన నా కేమి భయము?

హేమ: జీవనవల్లభా! నీ విచటనాండ్రకంటఁబడితివేని నే నీ ప్రపంచమునకుఁ దీఱినదాననే.

చంద్ర: చేలా! గోలపడకుము. అవసరమైనచోఁ దిరోధానకరణయోగ్యసాధనసామగ్రితోడనే యున్నాను. నీవు నన్నుపగూహించినపైని వారికంటఁ బడనిమ్ము. అప్పు డాత్మశాంతితో మరణసంతోష మనుభవించెదను

హేమ: ప్రొద్దుగ్రుంకి యట్లేల యనుకొనవలయుఁ గాని, ప్రియా! నా యునికిపట్టు నీ కెవ రెఱింగించిరి.

చంద్ర: అయ్యో! ఎవ రేల చెప్పవలయు? మోహదేవత తానై త్రోవఁ దీయుచు నన్నిచ్చోటుఁ జేర్చినది. కవికి రవికి దుర్గమస్థానమైనను మోహితునకు సుగమము. ఇప్పటికి మాత్రము నీ ప్రాపుఁ జేరితి నని యెట్లనఁ గలవు?

పూర్వాపరదిగంతవ్యాపిత పారావారోభయతటనివాససదృశదూరస్థలావాసుల మగు మన కేటి సుఖము?

హేమ : (ఆనంద పారవశ్యయై) మచ్చిత్తవిత్తహరా! తృప్తి వహింపుము. సాంద్రాంధకారయామినీపటలసదృశవిరోధాభరితే నయ్యు నున సిచ్చి మాటాడ సాహసించు చున్నాను. ఇంతకంటెను నీకు మన్నికటస్థానివాస ప్రాప్తి గల్గింప ముగ్ధాంగనాసహజశాలీనతాభరము నా నోప నొక్క.

సీ. సులభసాధ్యముగ నీ సాన్నిత్తి నంమను
జిన్న చూపుల నిరసింప కయ్య
విమలానురాగవివేకసద్ధర్మాను
కృతులందు మెప్పు లార్జింతు నయ్య
మాయమర్మము లేని నాయెడఁ గృతినిసు
పేమమాత్రము ప్రదర్శింప కయ్య
నీ దయాదాక్షిణ్యానియతియే హేమల
తాసతీజీవితాధార నయ్య
పేరునకు రెంపురూపులై వెలసియున్నఁ
గ్రియ సభేదాత్మ లనఁగ వర్తించి యేక
శయ్యఁ దనువులఁ జాలించి సద్యశంబు
నిఖిలదిశల స్థాపింప యత్నింత నయ్య.

చంద్ర : (ఆత్మగతమున) కేవలము ముగ్ధాంగనావాక్యంబు లయ్యు నెంతటి మనోహరము లగుచున్నవి. (ప్రకాశముగ) నా బహిఃప్రాణమా! నన్ను విశ్వసింపుము. నిజమరీచిసుధారంజితగసాప్లుతాఖిలభువనుండగు నిశాచ ........

హేమ : సత్యశీలా! క్షీణాయుర్దాయుండును, అస్థిరకళాసమర్థుండును, కళంకభూయిష్ఠుండును నగు గురుద్రోహిసాక్షిగాఁ బ్రమాణమూన్తు లాపకుము.

చంద్ర : వదనసమ్మోహనాస్త్రమా! అట్లయిన నెవరిఁ బేర్కొని ప్రమాణ మొనర్పు మనియెదవు? భవదభీప్సిత మనుసరింతును.

హేమ : అనుగ్రహించెద వేని మదారాధిత విశ్వసనీయదైవత మైన యుష్మద్దయాంతఃకరణసాక్షి – వచింపుము.

ప్రణయాదర్శము

చంద్ర: అట్లైన........ ...

హేమ: వలదు. మోహనాకారా! ఒట్టిడుకొనవలదు. అందు నాకుఁ గొంత తృప్తి యున్నను నీ యొడంబడిక నా కానందదాయకము గాదు. నేఁటి కది తొందర పాటును, అవివేకమును ఆకస్మికప్రత్యవభాసమును నగు సంకల్పము. అస్థిరతటిల్లతాప్రతిమానము. ప్రథమసమాగమానోన్యానురాగకుంద కుట్మలము పునస్సమావేశవసంతపవనాంకురముల వికసింపనిమ్ము. మన జీవిత చరిత్రంబుల సువర్ణాక్షరలిఖితశోభాయమాన మగు నీ ఘటికావిశేష మాత్మీయ నిష్కళంకహృదయఫలకవిలిఖితశాసనం బగుగాక! నిన్నింకను రాత్రివేళ నుద్యానవనసీమ నిల్పి శ్రమఁగల్గింపను.

చంద్ర: మత్పురాకృతపుణ్యఫలమా! నన్నిట్లసంతృప్తహృదయునిగా వీడ్కొలిపెదవా?

హేమ: అయ్యో!......ప్రాణాధికా! నిన్నీరాత్రి యింతకంటెను నేను సంతోషపెట్టు టెట్లు?

చంద్ర: భవదనురాగనిరూఢైకప్రమాణవాక్యమునకు నోచనా?

హేమ: అయ్యది నీ వభిలషింపక పూర్వమే నీ కొసంగబడినది. నీ యౌత్సుక్యముఁ దీర్చుటకు మరల నా యభయప్రదానము నా కర్పింపుము.

చంద్ర: ఉపసంహారము నీ బోంట్లకు భావ్యమా!

హేమ: మనోనాథుని తృప్తికొరకు. అయినను మదనంతాక్షయనిరుపమానానుక్షణాభ్యుదయదృఢస్వచ్ఛందస్వచ్ఛ స్థిరతర మోహగభీర పారావారమునకుఁ దఱుఁగు విఱుఁగు లేదు సుమా?

(నేపథ్యమున) హేమలతా! హేమలతా!

హేమ: హృదయానందకరా! ఇదే తిరిగివచ్చెదను. (నిష్క్రమించును)

చంద్ర: ఓహో! (నిమీలితాక్షుఁడై)

సీ. అనుపమామూల్యతరానేక చీనిచీ
నాంబరావృతము పర్యంకసీమ
సర్వభోగాపూర్ణ చారువైభవపాళి
నోలాడి మది కించు నుత్సవముల

తరుణవయోభావ తరలతానౌన్నత్య శే
దరహితపరిశ్రుతి సిన్ధుర భరించి
పరితూష్యపపవనాంకురస్పర్శ నిరుపమా
న [illegible] కేలిశ్రీమ [illegible]
బవలు శే లసక యానుభ [illegible]
వర్ణనాతీత సౌఖ్యమహా [illegible] వ ॥
స్పష్ట మగు భావనా [illegible] చము [illegible]
మేలుకొనియు స్వప్నపస్థ నొం [illegible] గుచుంటి.

నే ననుకొను నేను నేనుగా నున్నానో? లేనో? అగమ్యముగ నున్నది.

[హేమలత ప్రవేశము]

హేమ : మన్మనోహర పారావతమా! ఒక్క మాట!

శా. గాంధర్వంబునఁ జెట్టఁబట్టి చిరసౌఖ్యప్రాభవాలంబధీ
సంధానత్వముమైఁ దరింతము యశస్సౌభాగ్యసంతానసం
బంధప్రాప్తిఁ బ్రపంచమందు మృతజీవత్వంబు సిద్ధింపఁ బ్రా
గ్బంధప్రోద్భవలక్ష్యవిస్ఫురితదాంపత్యానుభోగంబులన్.

కాల మతిభారము. త్వరపడుము. సత్యహరిశ్చంద్రునిపై కంటెను నీపై నమ్మకము నిల్పితిని:

చంద్ర : మహాప్రసాదము. చంద్రశేఖరునకు – ఒక్క మాట – ఒక్క బాణము – ఒక్క పత్ని. విశ్వసింపుము. కపోతదాంపత్య మధిగమింతము.

హేమ : ఎక్కడ, ఎప్పుడు, ఎట్లు, వైవాహికక్రియ నిశ్చయింతువో యెల్లి ప్రభాతంబున నే తెలుప వలయు.

చంద్ర : మృగనేత్రా! అవశ్య మట్లొనర్చెదను.

హేమ : మృదుగాత్రా! నా దాది నుదయంబున నీ కడకుఁ బుత్తెంచెదను.

చంద్ర : మంచిది: తప్పక పంపుము.

హేమ : మహాశయా! శతసహస్రానేక నిర్మలప్రేమాభివందనములు. భవద్వదనేందు జనితదివ్యజ్యోతి స్సుధాధుని నిర్మగ్న పారవశ్యాన్యధర్మ విచార మారాంత

కరణాతిక్రాంత మర్యాదనై, నిన్నుఁ బెద్దయుం బ్రొద్దు నిల్పితిని, మన్నింపుము. నా కనుజ్ఞ దయచేసి మన్నింపుము.

(నేపథ్యమున)

హేమలతా ! హేమలతా !

హేమ : నాథా! నిర్ణీతసమయమును మఱతువుసుమీ?

చంద్ర : కల్ల.

(తిరిగి నేపథ్యమున)

హేమలతా !

హేమ : (పరుగిడుచు) ఇదిగో! స్మరణచిహ్నము.

(రుమాలు జారనిడచి నిష్క్రమించును.)

చంద్ర : ధన్యోస్మి. (రుమాలు గ్రహించి జేబులోఁ బెట్టికొని) మఱపు చొచ్చుటకు జంద్రశేఖర హృదయపరిపంచవిశాలభవనంబున విశ్రృతద్వారము లేదు. (రుమాలు నిర్దేశించుచు) ఈ నాఁటి కీశ్వరనిర్దిష్టనిధాన మీ రుమాలనియే మనశ్శాంతి బొందెదను. మన్మనోహారిణీదివ్యాంగ భోగభాగ్యానుభవ లాలసమైన రుమాలు నాకుఁ బ్రసాదింపఁబడుట హేమలతయే నా చెంత నున్నట్లు సంతసింతును. కట్టా! స్వగృహంబుఁ జేరు టెట్లు? దృష్టి భ్రష్టమైనది. మతి పతితమైనది. అర్ధాంగీమృదుమధురవాక్కులనా కాకలీస్వనముఖరితారామసీమ విడుచు టెట్లు? ఆహా! ఈ ప్రియావియోగము పాఠశాలా నిర్గమనసమయవిద్యార్థి వ్యాకులస్థితి సామ్యమును బొందుచుండును.

(భారముగా నడచుచున్నాఁడు)

హేమ : (ప్రవేశించి మందస్వరమున) మనోహరా! మనోహరా! (చిటిక వేయును)

చంద్ర : (ఆత్రముతో మరలి వచ్చుచు) ఏమి ఏమి! మనోహారిణీ!

హేమ : సమకాలికోత్తమ యోధాగ్రేసర స్తోత్ర పాత్ర శస్త్ర విద్యా సార సంగ్రహణైకప్రవీణా! నిర్మలప్రణయపాశనిబద్ధం జేసి, వీరభట రక్షాభిగుప్త సౌధపంజరాంతరావాసిని యగు మన్మనఃకీరము నాడించుచున్నావు గదా?

చంద్ర : కీరవాణీ! నేను సదా నీ చేతి క్రీడావస్తు వగుటకుఁ బ్రియత్నించెదను.

హేమ : తరించితిని. కాని నీతోడఁ జెప్పఁ దలఁచివచ్చినమాట స్మృతికి రాలేదు.

చంద్ర : తరుణీ! మఱియు వినుము. ప్రకృతి యడ్డమై నీకుఁ గొంతవడి మఱపుఁ గల్పించిన మన్నేత్రద్వయము త్వల్లావణ్యామృతాస్వాదనమదసంభృత రాగచరితార్థ మగుఁగాక.

హేమ : భవన్నికటమ్మో జీనివాసముకంటెను నాకుఁ బ్రకృతి వేఱుఁ గలదా? చెప్పవలసిన మాట మఱికి వచ్చుదాఁక నీ వుండక తప్పదు. నీ వున్నంత కాలము నన్ను నేనే మఱచుచున్నాను.

చంద్ర : నిజము. నిజము. నిన్ను నీవు, నన్ను నేను మఱచుచున్నాము. అనఁగా భగవదనుగ్రహమున నన్ను నీవు, నిన్ను నేను నావేశించితి మన్న మాట.

హేమ : తృణీకృతోదయభాస్కర తేజఃప్రభాకరా ! అపూర్వ ప్రసవ సాయకా! తూర్పు తెలవాఱుచున్నది. ఇఁక నిచట నీ యునికి క్షేమదాయకము గాదు. నిర్ణీత ఘటికా ప్రాప్తి కాల మతిభారముగాఁ దోఁచుసుమీ!

(నడచుచు నిష్క్రమించును)

చంద్ర : (నడచుచు) నాకు మాత్రమో!

సీ. దృఢపరిష్వంగబందీకృతి సౌఖ్యాతి
శయమున వర్తింపఁ జాలు టెపుడొ?
విదళిత స్వారాజ్య విభవైక మదన మ
హాసామ్రాజ్య సామ్రాజ్య మందు టెపుడొ?
ఉన్నత వక్షోజ యుగ్మశిఖరభాగ
నృత్యత్కరుండఁ గా నేర్చు టెపుడొ?
వదన పరిభూతలావణ్యామృతాస్వాద
నానిమిషపదవి నందు టెపుడొ?
పరిథిత శృంగారరసమహార్ణవ నిమగ్న
మత్త చిత్త తృణీకృతాయత్త భావ
సంభవోన్మాద మోద సంరంభమున యు
గంబు తెప్పపాటై పొడకట్టు టెపుడొ?

(గోడ దుమికి నిష్క్రమించుచున్నాఁడు.)

# ప్రణయాదర్శము

## ద్వితీయాంకము

### ప్రథమరంగము

(విశాలా పురీ ఘంటా పథము)

సదానందస్వామి : (వల్కలాంబర ధరుఁడై ప్రవేశించు చున్నాఁడు.)

చంద్రశేఖరుఁడు : (ప్రవేశించుచు) తాతగారూ! తాతగారూ! తమ కొఱకు ప్రాతఃకాలమునుండియుఁ దిరిగి తిరిగి కాడకి విసివి వేసారితిని.

సదా : ప్రతాపవర్మగారి యబ్బాయివా! ఏమినాయనా! నీవు పడుచువాఁడవు, నేను శతవృద్ధుఁడను. నాతో నీ కంతటి యత్యవసర మేమి తటస్థించినది?

చంద్ర : (చిర్నగవుతో) అధికావసరమే, తాతా!

సదా : (మేలముగా) ఏమైన వివాహసుముహూర్తము నిర్ణయింప వలయునా?

చంద్ర : తత్సంబంధమే. అగతానాగతవేత్తవు. తాతయ్యా! అసాధ్యుఁడవు

సదా : (నగుచు) నీ ముందసాధ్యమా? ఆంజనేయుని ముందు కుప్పిగంతులా? తత్సంబంధ మనుచున్నావు. కమలాబాయిని సాధించితివిగా, అబ్బాయీ! పిడుగువురా.

(వీఁపుపైఁ దట్టుచున్నాఁడు)

చంద్ర : విధినిర్ణయము వ్యతిరేకముగా నడచు చున్నది.

సదా : అది యేమి? అట్లనియెదవు?

చంద్ర : తాతా! ఏమనఁగలను?

ఉ. విందు నెపంబుపైఁ గమల విక్రమవర్మగృహంబునందుఁ గాం
చందగు నన్నయాసఁ జని, సర్వకళాపరిపూర్ణ, ధారుణీ
వందితరూపశీల, విభవస్ఫుటయౌవనదీధితిప్రభా
కందళితాంగి నోర్తుఁ బొడగంటినిఁ గన్నులకర్వు దీఱఁగన్.

## ద్వితీయాంకము

సదా : ఆ - చూచి రాజవైనందువలన ముందున్నదే పెండ్లికూఁతు రని నూత్న ప్రియత్వము సార్థక మొనర్చితివా?

చంద్రి : (చేతులు జోడించి) తాతా! మదవస్థ సాకల్యంబుగఁ జిత్తగింపక త్వరపడి కినియు చున్నారు.

సీ. కనినంత బంభరగుణనినాదం బది
త్రిభువనక్షోణిఁ బ్రతిధ్వనించె
తొయ్యాలి చిత్తంబుతోఁ బాటు మత్స్వాహ
సస్థైర్యశిఖరియు సంచలించె
ఉభయఫాల విలిఖితోక్తులుఁ బూర్వజ
న్మ సుకృతంబులతో సమన్వయించె
ప్రకృతికిం దోడయి భావజుం డంతట
మంతనంబులు వింత సంతరించె

పరిణయరసర్ఘురాప్లుత మోదభావవితతి
యంతలోఁ బరమావధి నధిగమించె
పైని గాంధర్వవైవాహికానుబంధ
రూఢకార్యైకతత్పరప్రౌఢి యెసఁగె.

అవసరంబైన రాక్షస వివాహమున కైన సంసిద్ధుల మైతిమి.

సదా : ఛీ! ఛీ! నిమ్న ప్రదేశైకాభిగమనత్వరితాచలశిఖరపతత్సరిఝ్ఝరీసదృశ యౌవన పురుష ప్రణయ ప్రవాహము, హృదయ స్థైర్య సంరూఢి రహితమై చక్షుఃప్రీతి మాత్ర సమధీన చంచల మగుచుఁ బరిపరి తెఱఁగులఁ బరుగు లిడుచుండును. నిన్న మొన్నటిదనుకఁ బ్రాణాధికముగఁ బ్రేమించు చున్న కమలను నేఁడు త్రోసిరా జనుచున్న నీ పతిచంచలుఁడ వనక తప్పదు. ఇంతలో నింత మార్పునకుఁ గతం బేమి?

చంద్రి: తాతయ్యా! మన్నింపుము.

సీ. ప్రబలప్రయత్నముపైఁ గూడ కమలాను
రాగ సౌభాగ్య సంప్రాప్తిఁ గనమి
దైవకృపాలబ్ధతరుణీలలామంబు
మన్మనఃకర్షణమంత్రి మగుట
వేళావిశేషంబు వినుతభావముఁ దిరో
ధాన మొనర్చి కైదండ యిడుట
సిద్ధాన్నవల్లబ్ధ జీవత్వదార్థ నే
వనబుద్ధి నుద్వేగపరత గనుట
వజ్రనిభమన స్థైర్యంబు భగ్నమై ప్ర
వాహజలసంచయముకంటెఁ బలుచనయ్యె
పరమయోగీశ్వరునకైన నరయు మీావ
అట్టి సమయాన నెద్ది గత్యంతరంబు?

సదా: ఓ! యబ్బో! ఈ మెట్ట వేదాంతము కొల్లేటి చేఁద్రిదువలె నంతము లే
కున్నది. ఇంతసేపటికి ఏతావతా నీ వలపుఁగత్తియ శతుంకన్యక యని
తేలినది. కానిమ్ము పిల్లపేరు పలుకు.

చంద్రి: (నవ్వుచు) తాతా! కాఁబోవు భార్యపేరుఁ జెప్పుకొనువాఁ డుండునా?
అది యట్లుండఁ జెప్పు మని ప్రశ్నించువాఁడు గల్గునా?

సదా: కుఱ్ఱా! నే నంతటి పూర్వాచారపరాయణుఁడ నైనను బెండ్లము పేరుఁ
జెప్పఁగూడ దను పుక్కిటి పురాణములఁ బట్టికొని వేలాడువాఁడఁ గాను.

చంద్రి: తాతా! నీ వంత పట్టుఁ బట్టితివేనిఁ జెవిలోఁ జెప్పెదను.

సదా: మనమిర్వురము మాత్ర మున్నప్పుడు, చెవిలోనఁ జెప్పెద ననుట, బధరుఁడ
నని యెత్తిపొడుచుట.

చంద్రి: తాతయ్యా! భల్లూకపుఁబట్టుగదా నీయది. ఆమె పేరు విద్యుల్లత.

సదా: విద్యుల్లత – (సాలోచనుఁడై) విద్యుల్లత.

చంద్రి: (నాలుకగఱచుకొని) కాదు కాదు. పొరపాటు – హేమలత.

## ద్వితీయాంకము

సదా: (నవ్వుచు) ఓరి పిల్లకాకీ! హేమలత విద్యుల్లత యైనది. ప్రపంచము పచ్చనైనదియా? తలక్రిందగును.

చంద్ర: తాతా! ఏమైనను గాలవిలంబమునకు సమయము గాదు.

మ. అనుమానింపక నిర్వహింపుము రహస్యస్ఫూర్తి దేవాలయం
బున నుద్వాహము నాకు నాపెకుఁ గృపాంభోరాశివై దానద
క్కును బుణ్యంబును బూరుషార్థమును నీకుఁ బుత్రభావంబుతో
నను నిందాఁకను గారవింతు విపుడా న్యాయంబు బాటింపవే.

(చరణాబ్జంబులపై వ్రాలుచున్నాఁడు)

సదా: (లేవఁదీసి సాదరముగ) కుర్రా! నీయెడ నా కిప్పటికిని భేదభావ ముండదు. కాని, యీ విషయమున మాత్రము మనసు పరిపరివిధంబులఁ బరితపించుచున్నది. చూడు—

సీ. ప్రత్యూహవర్ధితోభయకుటుంబాగత
కలహదవాగ్ని కీలలఁ దలంచి
విద్యుత్ప్రదర్శితావేగహతాద్భుత
ప్రణయరసానుభవంబు గనుక
జననీజనకతిరస్కార కార్యాయోగ్య
బాల్యవయోరాగభరితు లగుట
ప్రకృతిలీలావిచిత్రవ్యవహారాను
భవవేత్తృవార్ధకభరుఁడఁ గాన
సాహసించి నిర్వర్తింప సంశయింతు
దైవసంకల్ప మెట్టిదో తెలుపరాదు
వైర హాలాహలాంతర ప్రణయకల్పి
తామృతాభోగసక్తి భయావహంబు.

నీవు వయస్సునఁ జిన్నవయ్యు, బుద్ధిం గడుంగడుఁ బెద్దవు. చక్కగా నాలోచింపుము.

చంద్ర: తాతయ్యా! సమస్త మితఃపూర్వమే యాలోచించుకొంటిని. సంశయింపకుము. వేయి మృష లుచ్చరించియైన నొక యిల్లు నిల్పవలయునని నీ... తెలియంగవా? కనుక—

మ. అపవారింపకు మత్ర్పయత్నభవితవ్యం బెట్టిదేనైన ప్రా
ణపరిత్యాగమునేనిఁ జేసియు మహానందాత్మఁ బైకొందు స
త్కృప నెగ్గింపుము తోడునీడ వయి యీకృత్యంబు చేనున్న స్వ
ల్పపుఁ గార్యంబుఁ బరోపకారి విది నిర్వర్తింపఁ గాంచింతువే!

నను గట్టెక్కింపుము. (తిరిగి పాదాక్రాంతుఁ డగును.)

సదా : (లేవనెత్తుచు) కుమారా! లెమ్ము. ఏదియైనను బోనిమ్ము, ఏమైన రానిమ్ము! భవదభీప్సిత మీడేర్చెదను. నాతో రమ్ము. ఇంటికి వెళ్లి పంచాంగము చూచి సుముహూర్తము నిర్ణయించెదను. వలయు వస్తుసామగ్రియు వచింతు. దేవీ సత్కృపాపాత్రుఁడ వయ్యెదవు. నిశ్చింతముగ నుండుము.

(నడచుచున్నాఁడు)

చంద్ర : అనుగ్రహింపఁబడితిని.

(వెంటనే నడచును. ఇరువురును నిష్క్రమింతురు)

(మహాలక్ష్మి మరియొక వైపునుండి చిఱచిఱఁ బ్రవేశించును)

మహా : మోహితులకు ముసలితనము ముక్కుతన మని ముద్దా? మయూరము కంటి నీరు మృగయుని హృదయముఁ గరఁగించునా? వేసవికాలపుఁ బొద్దు నెత్తి కెక్కినది. నాకుఁ దలప్రాణము తోఁకకు వచ్చినది. తిరిగి తిరిగి కాళ్లు బడినవిగాని చంద్రశేఖరునిజాడ లేదు. ఈ పిల్లపిచ్చిగాని, యా సొగసుకాఁడే గడపదంటాలు పెట్టుచున్నాడో? నాయికానాయకులు కడుపులోఁ జల్ల కదలకుండఁ గూర్చున్నారు. మధ్య నాసులోఁ గండియుఁ గావలసిన నాపై విఱుచుకొనిన దీ భారమంతయు. క్షణమునకు వచ్చున దేమియుఁ దెలియదు. హేమలతాచంద్రశేఖరుల ప్రథమసమావేశము రాత్రియే జరిగినది. మాటలు గలియు టాలస్యము. మనసు లైక్యమై పోయినవి. అదేమి విచిత్రమో! హేమలతావాస మెటులఁ గన్నెట్టెనో? ప్రాకార మెట్లు దాఁటెనో? సౌధగవాక్షము చెంత నామె, క్రింద నీయన—అరుణోదయము దనుక నదెక్కడి యోపికయో? ఒక్కటే గుడగుడ గొడవతో, నర్థహీనపు టవ్యక్తప్రసంగములతో సరిపోయినది. తిరిగి తన పెద్దల ముల్లెయంతయుఁ బాడైపోయినట్లు

ప్రార్థనఁ జేయవచ్చినదియా? అప్పుడే నన్ను మేల్కొలిపి వివాహము, ఎక్కడ, ఎప్పుడు, ఎట్లు కనుగొనిరమ్మని తఱిమినది. "కాన్పిత్తవచ్చము - ప్రార్థించుఁగదు." ఒక్కొక్కరోజు మీఁదఁబడుకొలంది శరీరములో జవసత్త్వములు నశించుచుండుటఁ గదలమెదలలేని యెడ్పుగాని మా హేమలత చల్లనితల్లి. ఇన్నాళ్ళదాఁక నామె నే క్రియఁ బెంచి పెద్దదానిఁ జేసితివో? అంతకు వేయిమడుంగు లెక్కుడుగ నిప్పుడు నాకుఁ గాలు నొచ్చిన-వ్రేలునొచ్చినఁ గుడియెడమవిభేదము లేకుండ నెత్తిపోయుటలేదా? ఆమెఁ బాపము లాడినఁ బురుగులతోఁ గ్రుళ్ళిచావరా? కాదుగాని, నా కొక విషయమునమాత్రము మహాశ్చర్య మగుచున్నది. మా హేమలతకు సంకల్ప సంభవా శేశసంభవోత్తరక్షణమునుండియు సర్వాంగపరివర్తన మొడఁగూడి నాకే యౌవన పురుషబుద్ధిప్రాదుర్భావ మొదవుచున్నది.

తే. గీ. నేత్రపాళి బాష్పతరళ స్నిగ్ధమయ్యె
బిగుపయోధరద్వయము జృంభింపసాగె
స్వర్ణదేహకాంతిస్ఫూర్తి పరిఢవిల్లె
మొగ మకారణవ్రీడాప్రపూర్తిఁ గనియె.

దైవము మాత్రము యుక్తసంధాన మొనర్చినాఁడు. బెళగువ్వలజంట ననుకరించు హేమలతా చంద్రశేఖరుల జత నా కెంతయు ముద్దుముచ్చటగ నున్నది. ఇప్పుడు కాల విలంబనావసరము గాదు. హేమలత క్షణములు లెక్కించుచుండును. చంద్రశేఖరునిజాడఁ దీయవలయు. అతఁడీ కార్యసాధనమున కేమేమి యెత్తు లెత్తవలసి వచ్చినదియో?

(నిష్క్రమించుచున్నది.)

## ద్వితీయరంగము

### విక్రమవర్మ గృహాంతర్భాగము.

(హేమలత చెక్కుటం జెయిం జేర్చి ప్రవేశించును.)

హేమ : (నిరుత్సాహముతో) అవసరానవసరములు ముసలి తొక్కుల కెట్లు విశదమగును. మహాలక్ష్మిని నే నెంత త్వరపెట్టి పంపితినో, అంతకుం బదిరెట్లు జాగొనర్చినది. మట్టమధ్యాహ్నమైనది. దాది జాడ లేదు. ఇంతటి యాలస్యమెవ్వరిదై యుండును. మోహనాంగుని భావములు వ్యత్యస్తమై యుండునా? ఛీ! ఛీ! స్వప్నవార్త; నిర్నిమిత్త నిందారోపణ కళంకితచరిత్ర నగుచున్నాను. అధికానురాగ మమితానుమాన కారణము.

సీ. ఆత్మీయ సర్వస్వ మర్పించి నా పూంట
            కాపైన మన్మనఃకర్షణుండు
  ప్రాణంబు లరచేతి యందూని యేతెంచి
            నను బ్రతికించుకొనిన విభుండు
  పచ్చని తరులతావాటిక రేయి నక్క
            జేకొనం బ్రతిన దాల్చిన ప్రియుండు
  క్షణములో నన్ను లోంగొని తాను లోనైన
            నిష్కపటవ్రతనిర్మలుండు
  నేర మేమి చూపెట్టి తృణీకరించు
  భ్రాంతిమూలక మైన మదంతరాత్మ
  మద్విశుద్ధప్రవర్తన మహిమ విశ్వ
  సించి నిశ్చింతతోడ వర్తించుంగాక.

కావ్యంబులం 'బురుషుల నమ్మరాదు, రాజులు నూతనప్రియులు'! అని కవులు వర్ణింతురుగాని నేను విశ్వసింపను. మద్విశుద్ధ హృదయాంతరాళ కారాగారనిబద్ధుం డగు జీవితేశుం డన్యాయత్తుం డగుట కవకాశ మెక్కడిది? (ఆలోకించి) అదిగో! పాదములసవ్వడి వినవయ్యెడి. దాది వచ్చుచున్నట్లున్నది. (ద్వారముకడకుం బోయి) బైసిమాలిన హృదయమా? ఉద్వేగం

బున సమీరునితోఁ బ్రసంగించుచున్నావు. సందేహపరితప్త హృదయవల్లిక - మహాలక్ష్మివచస్సులఁగాని, తేలుటో - తీఱుటో విస్పష్టముగాదు. హృదయమయూరీదృష్టంబగు ఆశానీరదము దూగద వానల ధూమముగాఁ బరివర్తిత మగునా? అదిగో! పడుచు, లేచుచు నడువలేక - నడువలేక, దాది వచ్చుచున్నది. (ఎదుర్కొని) దాదీ! దాదీ!

మహా: (ప్రవేశించుచు) అబ్బబ్బా! ఉండవమ్మా! దాగి లేదు. బూది లేదు. నాకు జాబైన వచ్చినదా? నన్నా గుండాలు రోసినవి. (వణకలఁ బడుచున్నది)

హేమ: అయ్యో! మహాలక్ష్మీ! నీ శరీరమున నెప్పున్నది? అతఁడు నీకుఁ గాన్పించినాఁడా?

మహా: చావఁబోవుచు నుంచి ద్వితీయునివారము. తిరిగి, తిరిగి, నవయావస్థాధి నకుఁ గోల్పడితిని. బ్రిమకనిమ్మా. ఆ బండాలము పైటఁ బెట్టితివను.

హేమ: మంచితైలము దెచ్చి మర్దనఁ జేసెదను. నీ వాయనజాడఁ దెలిసికొంటివా!

మహా: నీ ఘ్రాణమ్మె మాయెను. నాకుఁ దైలమువద్దు, తంగేడుచెక్కయు వద్దు. నీవు కూర్చుండుము.

హేమ: కూర్చుండుట కేమి? చంద్రశేఖరుని సందర్శించితివా?

మహా: ఊపిరి విడువనీయవు గదా? ఆ బంగారయ్యను పర్వ్య చితిని చక్కనిచుక్క. ఏమి యొరగినది? కడుపునిండినదా?

హేమ: నేను రూపవిషయమై నిన్నుఁ బ్రశ్నించితినా?

మహా: కాదులే- సదసద్వివేకుఁడు, సరియా? సర్వజ్ఞుఁడు. మరియు నీకుఁగఁ [illegible] మానుఁడు. అమరేంద్ర ప్రభావుఁడు. అవతారమూర్తి. నచ్చినదియా?

హేమ: కాదే! ఇపు డాయన రూపరేఖాది సద్గుణంబు లెవరి కవసరము? అయ్యనఘుఁడు నీతో నేమనినాఁడు?

మహా: ఏమనినాఁడా? బెక్కులఁ గట్టికొని తెవ్వున లేచివచ్చి నీ యొడిలోఁ గూర్చుండెద ననినాఁడు.

హేమ: దాదీ! ప్రొద్దస్తమానము హాస్యమేనా?

మహా: నా బ్రతుకే హాస్యము.

హేమ: పరిహాసమునకు మాత్రము దేశకాలపాత్రములు లేవా?

# ప్రణయాదర్శము

మహా : లేకేమి? ప్రియాదేశము, బాల్యకాలము, నాయికాపాత్రము- మూడును ముచ్చటగ ముడివడి ముద్దులొల్కుచున్నవి.

హేమ : నేనును ముద్దుముద్దుల కొఱకే మురియుచున్నాను. ఇదిగో! చూడు.

తే. గీ. చూచినంతనె ప్రణయార్ద్రసుందరుఁడయి
దూతికాయోగ్య మర్యాద తొలకరింప
నిన్ను గౌరవించి నను మన్నించినాఁడె?
స్థిరయశస్సాంద్రుఁడా చంద్రశేఖరుండు.

మహా : వెఱ్ఱిపడుచా! ప్రేమ గ్రుడ్డి దనుట నీ యెడ సార్థక మగుచున్నది. అకారణమున కాధారము, నీ వలపునకుఁ గారణము, హుళక్కి.

హేమ : ఔను. అకారణానురాగసంధానమే సుస్థిరము. కారణానుబంధము బుద్బుదము. కారణము నశించిన సంబంధము గతించును. అహేతుకప్రణయము కల్పాంతమునకైన వికల్పమొందదు. కనుకఁ బ్రేమ గ్రుడ్డిదైనపుడే యీ స్వారస్యము వెలువడుచున్నది. మదనురాగమున కంధత్వ మారోపించి ప్రణయప్రపంచమునం దగ్రస్థానముఁ గల్పించితివి. నీ వెఱుంగని దేమున్నది? నీ విదియంతయుఁ గ్రాఁచి వడియఁబోసినదే.

మహా : అమాయకురాలా! నీ గోడే నీకుఁ గాని నాయకుని భావాభావము లెట్టివో విచారించవలదా?

హేమ : వలదు. మతిమాలినదానా! వలదు. అయ్యనఘుని ప్రేమస్వరూపముఁ బరీక్షించుటకు నా కధికారము లేదు. అతఁడు నన్నుఁ బ్రేమించినఁగాని నే నాయనఁ బ్రేమింప నను నియమసమన్వితానురాగము గాదు నా యది. నా ధర్మము- వారియందు నాకుఁ గల్గిన నిష్కారణానురాగము దృఢముగ నిల్పుకొనుట. ప్రియుఁడు నన్ననుగ్రహించినను, నిగ్రహించినను నేఁ బ్రేమించుట కభ్యంతర ముండదు. చాతకమునకు వానచినుకుపైని, నెమ్మి కంబుదము మీఁద, తొగకుఁ గలువరాయని యందు నెట్లు కారణజన్యబద్ధానురాగమో, యట్లే యొకరిపై నొకరికి, నొకొకప్పుడు, హఠాత్తుగఁ బ్రణయము జనియించి స్థిరస్థాయి యగుచుండుట నైసర్గికము.

మహా : ఏమో? ఈ నిష్కారణానురాగబంధములు నైసర్గికజన్యంబులు, అనన్యవేద్యంబులు - మా కాలములో మే మెఱుంగము సుమా.

## ద్వితీయాంకము

హేమ : (పరిహాసముగా) అబ్బో! ఎఱుంగకున్న నే నేఁటికిఁగూడ ముసలయ్యమాట వచ్చిన మురియుచుందువా?

మహా : చాలు చాలు. చివరకు నీకు వసంతము లాడుట కవ్వ లభించినది.

హేమ : ఈ కొంటెగాని మాటలు మాని నా కిందుకు ముందు బ్రత్యుత్తరింపుము.

తే. గీ. నన్ను నైవాహికమునకు నన్నుతాంగుఁ
డెచటి కెప్పుడు రమ్మని వచియించినాఁడు?
తత్సుధాపూర వాగ్వర్ష ధార హృదయ
చాతకవిరహదాహోపశాంతి నెఱపు.

మహా : అబ్బబ్బా! శనియైన నేఁడేండ్లకుఁ దొలఁగుఁగాని నీవుఁబట్టినఁ బీల్చి పిప్పిఁ జేయక మానవు.

హేమ : ఔనే! పొంగఁగాఁగి చల్లాఱిన పాల ననుకరించు నీ కిట్టి వ్యవహారముల యం దెంతయో హృదయశాంతి యుండఁగలదు.

మహా : పిల్లా! నీ మంచె మేలములు దుర్భరములు. వినుము. చంద్రశేఖరుని సదానంద స్వామి గృహమునఁ జూడఁగలిగితిని. నన్నుఁ జూచి యుప్పొంగుచు నీ వలపుల శాఁ జూచి 'మహాలక్ష్మి! సర్వముఁ జక్కఁబెట్టితిని. నేఁటి సాయం సమయమున దేవ్యాలయంబున వివాహము నిశ్చయించితిమి. హేమలతం దోడ్కొనిరమ్ము. తల్లిచాటుబిడ్డ. శుభకార్యము. వ్యయముండును' అని యేనూఱు నవరసులు నీ కంపియున్నాఁడు.

హేమ : అమూల్యమగు మదభిమానధనముతోఁబాటు నా సర్వస్వమును మదిష్ట దైవతమైన తనదైనయప్పుడు నా కేమి కొదువ? ధనము భద్రపఱుపుము. మనము నిర్ణీతసమయమునకు వనవిహారము నెపంబుననో, దేవీ సందర్శనవ్యాజముననో, వారిం గలసికొనవచ్చును. మరియు విశేషము లేమి?

మహా : అంతముఖ్యమైన విశేషములు లేవుగాని, ప్రసంగవశమున సంభవించిన నా సహజ సరసాలాపంబులకుఁ బ్రత్యుత్తరముగ నీ మనోహరుఁడు,

సీ. హేమలతారూపనామస్మరణ దప్ప
నితరం జిత్తపరం బెఱుంగఁడనుము
ఆదర్శనీయమై యలరారు మత్ప్రణ
య రసప్రవాహ మనంత మనుము
తన నిమిత్తంబయి తలఁదీసి భక్తిన
ర్పింప నైనను సంశయింప ననుము
నన్నపేక్షించియుఁ జిన్నబుచ్చిసఁగాని
మదనురాగము చెక్కుచెదర దనుము
తనదు కౌగిలింత తను పొక్కుటణ మేని
బుణ్యలోక మొందఁ బోలు ననుము
చంద్రశేఖరుండు సత్యసంధుఁ డటంచుఁ
బ్రజ్ఞయె విశదీకరించు ననుము.

గీ. రాద్ధాంతసిద్ధాంతములతోఁ జేటభారతము చెప్పినాఁడు.

హేమ: అయ్యో! మహాలక్ష్మీ! ఎంతటి యకార్య మొనర్చితివి. నీచేతఁ బావకుని పవిత్రతయే సంశయింపఁబడినది. నీ సరసాలాపములు నా భావము లని మన్మనోహరుఁడు భ్రమించెనేని హేమలత యీ లోకమునకుఁ దీరినదే సుమా ?

మహా: నోరుఁ దెఱచిన బూతుగా నున్నది. (తనలో) ఈ యత్యంతానౌచిత్యాను రాగం బెట్లుగాఁ బరిణమించునో ?

హేమ: మహాలక్ష్మి! ఒక్కదానికి మాత్రము గర్వించుచున్నాను.

క. సతికై శిర మర్పించెడి
పతిఁ జేపట్టిన నెలంత బ్రదుకు బ్రదు కగుఁగా
మృతజీవులెకా తక్కం
పతు లాచంద్రార్కకీర్తిభావుకు లగుటన్.

మహా: (శిరము నిమురుచు) ఔను తల్లీ! పూర్వసంచితఫలమునఁ జంద్రశేఖరుఁడు నీకు దక్కుచున్నాఁడు. నిర్ణీతసమయ మాసన్నమైనది. నిన్నుఁ బెండ్లి

కూడను చేయవలసిన పని యున్నది. సుమంగళాభ్యంగస్నాన మొకటున్నది. త్వరపడుము, లెమ్ము.

హేమ: (నవ్వుచు) అభ్యంగమున కభ్యంతరముం గల్పింపను.

మహా: దేనికిమాత్రము నీ మాటంతకవలయునట కన్నాక పెక్కుడిది? శుభకార్యమున సర్వమును, శాస్త్రీయముగా గాఁగాఁ పిమ్మట ననుసరింప వలయు.

హేమ: అట్లే యగుంగాక.

(ఇద్దరును నిష్క్రమింతురు.)

## తృతీయరంగము

### శ్రీ కాళికాదేవ్యాలయ ప్రాంగణము

(చంద్రశేఖర సదానందులు ప్రవేశము)

చంద్ర: తాతయ్యా! మీరు నూఱనుండు. వేయియనుండు. నేను మాత్ర మంగీకరింపను. పెద్దలకుఁ జెప్పఁదగినవాఁడఁగాను కాని,

ఉ. అల్పునిభంగి దుశ్శకున మంచు భయంపడ నేల? ధర్మసం
కల్ప దృఢత్వ ముండవలెఁ గాక విఘాతజవదాఁటి యెవ్వఁ డా
కల్పము నుట్టిఁ గట్టుకొని కాఁపురముండును! ప్రాణహానికిన్
గొల్పడఁ గొంక తద్విమలపాణిపరిగ్రహణాభిలాషినై.

సదా: దైవమా! అమంగళము ప్రతిహతమగుంగాక. అనిమిత్తంబుగ శుభసమయంబున వధూవరులనోట నిట్టి యనుచితంబులు వెలువడరాదు. భవదభిప్రాయ సమర్థనమునందుఁ గూడ నశ్లీలము స్ఫురించుచున్నది. తండ్రీ! నా మాట వినుము.

చంద్ర: తాతయ్యా! పొరపడుచున్నారు.

తే. గీ. వ్యక్తిహృదయస్థితోద్రేక మనుసరించి
మంగళామంగళార్థసంభవ మొసంగు.
బ్రహ్మవ్రాఁతలఁబట్టి శుభాశుభములు
జెలఁగు, మానవప్రజ్ఞా విశేష మున్నె?

మాఁడవలసిన మేలు కీళ్ళు రమ్మనిన రావు; పొమ్మనినఁబోవు. పూర్వజన్మ పుణ్య పాపంబులఁ దూఁచి నొసట వ్రాసిన బ్రహ్మవ్రాఁతఁ దుడుచుట కా తాతయు నసమర్థుండు.

సదా: నాయనా! నిన్నుఁ గాదనలేకున్నాను. సాహసింపఁజాలకున్నాఁడ. ప్రాకృతుల మైన మన మింత మొండిచెఱవఁ జూపింపనేరము. సర్వసంగపరిత్యాగి నయ్యు నేనే సంశయించుచున్నాను. కుసుమశర విసర సంచలిత హృదయోద్వేగపూరిత యుష్మదుద్యద్ధైర్యసాహసము లతిగా నున్నవి. కని పెంచిన తండ్రికంటెను నీ కెక్కుడుఁ గూర్చువాఁడఁ గాన నీ కపాయము శంకించి నిన్ను మఱలింప నుపాయాంతరముఁ గానక వగలఁ బొగిలెద.

చంద్ర: తాతా! నాయెడఁ గల ప్రేమాతిశయమునఁ దమ హృదయము దూరాలోచనశూన్యత్వముఁ దాల్చుచున్నది.

శ్లో. సర్వధర్మాన్ పరిత్యజ్య మామేకం శరణం వ్రజ
అహం త్వా సర్వపాపేభ్యో మోక్షయిష్యామి మాశుచః.

అని గీతానూక్తి. సర్వభారమును భగవంతునిపై మోపి నిర్వహింపుము. ఫలితము జనసామాన్యమున కెట్లుగాఁ బొడకట్టినను దైవచేష్టితములు మోక్షప్రదములు. అదియునుగాక యొక్కొక్క జీవి బాగోగులు శకునములబట్టి నిర్ణయించుట దుస్సాధము. అయినను హేమలత కుంకుమమాంగల్య ప్రభావంబును, నా యదృష్టంబును దిన్నగ నుండవలయుఁగాక! ఎట్టి బన్నంబులును గాలిలోని దూదిపింజలవలె నెగిరిపోవు ననుటకు సావిత్రీసత్యవంతుల చారిత్రము సాక్షీభూతము గాదా? తుల్యమనోరథులయందు నిర్మల దాంపత్యానుభవంబు క్షణమైనను శాశ్వతంబు. మరియు మే మెన్నెన్ని జన్మంబు లెత్తితిమో? ఇంక నెన్నెన్ని యెత్త నుంటిమో? అన్నిసారులును సతీపతులమై తీఱవలయుఁగదా? ఈ తరమున నీ శరీరములు నశించినను, ప్రతిజన్మావసానకాలములయందును దేహములు మాయమగుచున్నను, ఆత్మైకసంబంధము మాత్రము సంచిత మనుభవించవలసినంత కాలమును మాఱదుగదా! కనుక తమ రీ విషయమై సందే

హింప వలదు. అదిగో! మహాలక్ష్మీద్వితీయయై హేమలత వచ్చుచున్నది. మనముగూడ దేవాలయముఁ బ్రవేశింతము.

(ఇర్వురును బరిక్రమింతురు, దేవాలయాంతర్భాగము)

చంద్ర : (దృష్టి సారించి)

సీ. నునుసిగ్గు దొంతరలనుఁగూడి మాధుర్యసం
దేశంబు లెనసి మూర్తీభవింప
ప్రణయరసాప్లుతభావం బది లలిత
మందస్మితాకృతి సందడింప
గాంధర్వవైవాహిక రహస్య గోపన
గంభీర హృదయంబు కందళింప
కార్యదీక్షాదక్షకలిత భావవ్యక్తి
విరళదృగ్విసరంబు పరిఢవిల్ల
ఘనకుచనితంబభారంపుఁ గలిమిచేసి
కలదు లేదనఁదగు వలగ్న మసియాడ
దుశ్శకునదోషపరిహార ధూర్వహముగ
వచ్చె మత్పూర్వపుణ్యతపఃఫలంబు.

[హేమలత, మహాలక్ష్మి ప్రవేశింతురు]

హేమ : (వ్రీడాతిరేకమున) ఆర్యా! అభివందనము.

చంద్ర : (చిర్నగవుతో) దీర్ఘాయుష్మతీ భవ.

మహా : ఇవియే నవనాగరికతలు, నాకు గిట్టవు. లగ్నమైనఁ గాలేదు. అప్పుడే వధూవరు లందఱిముందు, దండములు, ఆశీర్వాదములు జరుపుకొనవలసిన దేనా? అనిన అనిన దందురు. ఒకరు చెప్పిన వినరు. తమకుఁ దోఁచదు.

హేమ : (మందహాసముతో) పోనిమ్ము. ఇఁకముందు నిన్నతిక్రమింపను. స్వామీ! ప్రణమిల్లుచున్నాను.

సదా : దీర్ఘసుమంగలీభవ! ముహూర్తము సమీపించినది. వధూవరు లాలయముఁ బ్రవేశింపుడు.

(అందఱు గర్భగుడిలోని కరుగుదురు
యథావిధి వివాహతంత్రము నిర్వహింపఁబడును.)

ప్రణయాదర్శము

సదా : (వధూవరుల గృహీతాన్యోన్యహస్తాబ్జులం జేసి) నూతన దంపతులారా! నా కర్తవ్యము ముగించితిని. ఎప్పటికైనను నావలన మీ కట్టి సహాయము గావలసియున్నను దైవమునకుఁ బ్రతిఘటించియుంట బ్రతిఫలానే నేఁటికైనను నెఱవేఱునట్లు తలతో నిర్వహించి మీ మీ యభీష్టము లీడేర్చెదను. బహుపుత్ర పౌత్ర ప్రపౌత్రులఁ గాంచి భవదీయవంశము, తామరతంపరయై వృద్ధిఁబొందుఁ గాక యని పరదేవతానుగ్రహము నభిలషించుచుందును.

మ. అతిలోక ప్రతిభాచరిత్రులయి యన్యోన్యానురాగప్రభా
యుతులై, సంతతభోగ భాగ్యకలితోద్యోగానుసంధానసం
భృతులై వార్ధిచతుష్క మేఖలిత పృథ్వీవ్యాప్త దివ్యద్యశో
న్వితులై దంపతులార! వర్ధిలుఁడు, దేవీ సత్కృపాపాత్రులై.

(అక్షతలను జల్లుచున్నాఁడు.)

మహా : తథాస్తు, తథాస్తు.

సదా : వధూవరులు వైశిమ కౌశలవలయు. అలసించిన రహస్యము బహిరంగమగును.

చంద్ర : }
హేమ : } దేవా! సాష్టాంగదండప్రణామము లొనర్చుచున్నాము.

సదా : సుపుత్రావాప్తి రస్తు - ఇఁక నే బోయివచ్చెదను (నిష్క్రమించును)

మహా : అమ్మాయీ! రా, రా! ప్రొద్దెంతయో లేదు!

(అందఱుఁ బరిక్రమింతురు. దేవాలయప్రాంగణము)

హేమ : ప్రియతమా? రాత్రికి దర్శన మగునా!

మహా : పొరపాటున నయ్యగారు కమలాగృహాభిముఖు లయ్యెదరేమో? కమల ముందు హేమలత నిస్తేజురాలు గదా! (నవ్వును)

హేమ : (దాదిని తీవ్రదృక్కుల వారించును)

చంద్ర : సందేహప్రారంభమా?

హేమ : నాథా! విదూషకురాలగు దాదిమాటలం బాటింపకుము.

మహా : ఇది యంతయు నా కెందులకు? (నిష్క్రమణము)

చంద్ర : నక్కయెక్కడ - నాక మెక్కడ? - కమలయెక్కడ - హేమలత యెక్కడ? పాణిపదమా! ముఖస్తుతిగా భావింపవేని నొకమాటఁ జెప్పెదను.

ఉ. ఆమెకు నీకు హస్తిమశకాంతర మున్నది నైజరూపరే
ఖామహనీయ సద్హృదయ గౌరవయౌవన శేముషీ పరిభో
ద్దామకళాకలాపముల, త్వాదృశ లక్షణ లక్షితాంగి స్వా
ర్థాభిమిలందె సున్న, కుచపాళి స్పృశించి వచింతు నొట్టుగన్.

(ముద్దాడు చున్నాఁడు)

హేమ : దేవరవారి యనుగ్రహ మున్న గోరంతలు కొండంత లగును. దాది వెళ్లు చున్నది, నాకు సెలవిత్తురా?

చంద్ర : పోయివత్తము. (గృహాభిముఖు లయ్యెదరు)
మనోహారిణీ ! ఏదీ ! ఏదీ ! ఒక్కసారి...(బాహువులు సాచును.)

హేమ : మనోహరా ! ప్రార్థేయమా ? (కౌగిటఁ జిక్కుచు) ప్రాజ్ఞులకు మోహాంధకార మలముకొనరాదు.

చంద్ర : సాంద్రాంధకారము నీ శిరోజములందే కాఁపుర మొనర్చుచుండ న న్నాక్రమింపకుండు టెట్లు ?

హేమ : సెలవిండు, వేచియుందును సుమా ?

చంద్ర : అంతకుమున్నే యథాస్థానమునఁ గాచియుండెదను.

హేమ : దాది నా కొఱకు నిలిచి యున్నది.

చంద్ర : నీవు నన్ను నిలువరించితివి. (పోఁబోవ)

హేమ : నన్ను మీరో ? (నడచుచున్నది)

చంద్ర : నిన్ను నేనా ? (చెక్కిలి నిమురుచు నిష్క్రమించును.)

హేమ: కాని... రాత్రికి...(శిరఃకంపముతోఁ గొనపంట మోవిని నవరించుకొనుచుఁ దర్జనిచే బెదరించుచు నిష్క్రమించును.)

# ప్రణయాదర్శము

## తృతీయాంకము

### ప్రథమరంగము

[నగరఘంటాపథమున విజయవర్మ మాధవవర్మలు ప్రవేశింతురు]

**మాధ :** విజయా! చంద్రశేఖరుని దర్శనమే కఱవైనది సుమా!

**విజయ :** మాధవా! అగును. అతఁడిటీవల బొత్తిగ మతిచెడి తిరుగుచున్నాఁడు.

క. తనలోఁ దానే మోనగు
మనసిచ్చి మెలంగఁబోఁడు మనతో నైనన్
దినదినమునకుఁ గృశించెను
మనసిజబాణాభిభూతిమాహాత్మ్యముచే.

**మాధ :** నెచ్చెలీ! ఇది నైసర్గికము. కామక్రోధాది దుర్వ్యసనములకుఁ జిక్కిన నింకఁ జెప్పవలయునా?

**విజయ :** మిత్రమా! ఇదివరకు మాట యెట్లున్నను నిన్నటిరాత్రి నుండియు మన స్నేహితునకుఁ దనశరీరమే తన స్వాధీనముగ లేదు.

తే. గీ. అభినవసుమమాతరుణ వయోతిశయము
గాంచి హేమలత నెపుడాసించినాఁడో
నాఁటితోడనే దూరమైనాఁడు మనకుఁ
జంద్రశేఖరుండీ ప్రపంచంబు మఱచి.

**మాధ :** వయస్యా! నిశ్చయమున కీముప్పు నీ చేసేత సంభవించినది. నీ బలవంతము లేకున్న నాతఁడీ విందునకు వెడలియుండడు.

**విజయ :** హితుఁడా! మన మన ప్రయత్నాప్రయత్నము లెంత? మన మన సెంత? మనము నిమిత్తమాత్రులము. విధి దుర్నివారము.

శూరసేనుడు : (ప్రవేశించి) విధిబలముకంటెను బలవత్తరమైన మద్బాహుబల మనివార్యము.

శా. పాఱుంబోతులరై తొలంగ కిట నిల్వంబోలు ప్రచ్ఛన్న వే
షారంభైక దురాగత ప్రతిఫలోద్యచ్ఛాత్రవాసృఙ్ఝరీ
ధారాస్నాతకవృత్తి ఖడ్గము కృతార్థత్వంబు నార్జింప ని
ర్వైరప్రాప్త సుఖాతిరేకహృదయస్వాస్థ్యం బపేక్షించెడిన్.

మాధ : (రోషించుచున్నాఁడు)

విజయ : (నిలువరించుచు) శూరసేనా! కోపం బుపసంహరింపుము. రక్తపాతము గర్హ్యము. సత్త్వసంపద్వ్యాప్తి జీవిత తరణోపాయము. ప్రతాపవర్మ, విక్రమవర్మల వైరంబు మనల కప్పగింపఁజేసికొని చరణాయుధంబులమాడ్కిఁ గయ్యాల కియ్యకొనుట లజ్జాకరము. నీ యాజన్మశత్రు వగు చంద్రశేఖరుఁడు గూడ నిందు లేఁడు. భవన్నిర్మిత్తాశాంతి హేతుభూతమగు ప్రవర్తనము దిద్దికొన బతిమాలెదను.

శూర : ఛీ! ఛీ, భీరులారా! క్షత్రియనామమాత్రోపజీవులగు మీ చరిత్రములు బంగరు పిచ్చుకల సామ్యముఁ బొందుచున్నవి. ఖడ్గజీవుల వంశములం దుద్భవించిన మీకింతటి యశక్తదుర్జనత్వ మెట్లలవడియెనో యని సిగ్గగుచున్నది.

మాధ : ఆ. దురభిమానగర్వోద్ధతోన్మత్త వ్యర్థప్రలాపీ!

శా. పోనిమ్మంచు సహింపఁ బ్రేలెదవు నో ర్మాయింతు నీకంటెనున్
హీను ల్లేరిట ఖడ్గవిద్య విజయుం డిందాఁక శాంత్యైక సం
ధానోద్దేశము మై మెలంగకయె యున్నన్ మద్బలోదగ్రబా
హానృత్యన్మహనీయశస్త్రహతి నీ ప్రాణంబులున్ నిల్చునే?

శూర : ఓరీ! ఇపుడు మాత్ర మేమి మిగిలిపోయినదిరా?

మాధ : లేదుగనుక నే కాచుకొనరా? (మీఁది కుఱుకును)

విజయ: (ఇరువురిమధ్య నిల్చుండి) అయ్యయ్యో! మిమ్మే మనఁగలను. శాంతింపుము. నిష్కారణవైరములఁ బెంచుకొనవలదు.

మాధ : మిత్రమా! నీవు నా కిఁక నడ్డురాకుము. (హుంకరించును)

శూర : నీ కొక రడ్డైనను మరణము ధ్రువంబు. (సిద్ధపడును)

# ప్రణయాదర్శము

చంద్రి : (ప్రవేశించుచు) మరల రక్తపాతమా ?

శూర : నీవు వచ్చితివి. నీకై యెదురుచూచుచున్నాను. వీరిలో నేమిపని? రారమ్ము.

(ఉత్తాతఖడ్గుఁ డగుచున్నాఁడు)

చంద్రి : (నమోవాకంబుతో)

మ. నను మన్నింపుము నిన్నెదుర్కొను బలౌన్నత్యంబు మృగ్యంబు నా
కని కేల్మోడ్చి నమస్కరించెద దయాస్వాంతుండవై వైర మె
ల్లను భావింపక శుద్ధసత్త్వవచనాలాపంబులన్ మైత్రిఁ గో
రిన నా యందు ననుగ్రహింపఁదగు దోర్వీర్యప్రభాంభోనిధీ.

మహాసందర్భమునఁ బ్రాణార్పణం బొనరింతుఁగాని నీపైఁ గత్తి నెత్తను.

శూర : నిరభిమానీ ! మగవాఁడవని భావించితిఁ గాని మగువ వటంచు నెంచనైతిని.

క. రోసం బెఱుఁగని బాపఁడు
మీసం బేటికి? రణేచ్ఛ మిలదహమిక నీ
కోసం బే తేరిన నా
తో సఖ్యం బభిలషించెదు పిఱికిపందా!

చంద్ర : (చిఱునగు మొగంబున) నిరభ్యంతరముగ నీ యభిప్రాయమున నే నేకీభవించుచున్నాను. న న్నాకస్మికముగ నింతటి పిఱికిపంద నొనర్చిన యనూహ్యాపరిమేయ సన్నివేశము సాధ్యమైనంత త్వరలో నీకుఁ దెలియఁగలదు.

మాధ : మిత్రమా! ఆ యనూహ్యాపరిమేయ సన్నివేశావిర్భూతనిరభిమానతావృత పరమసాత్త్వికస్వరూపైకతత్త్వము నీతోడనే నిల్చుఁగాక. నన్ననుమతింపుము. ఈ ప్రల్లదుని త్రుళ్లడఁగించెదను.

శూర : జగదేక ఖడ్గవిద్యాధురంధరప్రఖ్యాత సామర్థ్యచిహ్నాంకితుండగు నీ మిత్రుఁడీ నాటికిఁ గోఁచయైనను నీ యందైన రవంత వీరరక్తప్రచారము గానిపించుచున్నది. మీమువ్వురం దెవ్వరైనను సంతసమే, రండు. (సిద్ధమగును)

చంద్ర : మాధవా! నీవయిన నామాటఁ బాటింపఁగూడదా ? (బతిమాలును.)

మాధ : మిత్రమా! వానిని రానిమ్ము. చట్రాతిపైఁ గొట్టఁబడిన మృద్ఘటప్రక్రియ ముష్టిఘాతంబున మూర్ధము శతసహస్రశకలంబులై మేదోలవంబులు వర్గెలంకులఁ జింద వీనిఁ జించి చెండాడెద. (సంరంభించును)

చంద్ర : (ఇద్దఱమధ్య నిలచి వారించుచు)
మిత్రులారా! పూర్వవైషమ్యములు విస్మరింపుడు.

శూర : (ఏమఱియున్న మాధవవర్మను బొడిచి పరుగిడును)

మాధ : హా......చంద్రశేఖరా! నన్నుఁబట్టి పొడిపించితివి. మిత్రమా!
ని-ల్వ-లేకు-న్నాను.
(ఒరగును. చంద్రశేఖర విజయవర్మ లానుకొనెదరు)

చంద్ర : విజయా! దుర్మార్గుం డెంతటి కుటిలవృత్తి వర్తించెను? మాధవవర్మకు స్మృతి దప్పుచున్నది. అదె యాయుర్వేదధర్మవైద్యశాల. అచటికిఁ గొంపోవుదము.
(ఇరువురును మాధవవర్మఁ గొంపోవుదురు)

[వైద్యశాల ముందుభాగము. చంద్రశేఖర విజయవర్మలు ప్రవేశింతురు]

విజయ : మిత్రమా! చూపులకు గాయ మంత ప్రబలముగాఁ గాన్పింపకపోయినను నేమాత్రమో గుండెకుఁ దాఁకియుండును. లేకున్న నింత త్వరలో మరణించి యుండఁడు.

చంద్ర : ఇంతకు నేను గారకుండను. నేను వారింపకుండియున్న మాధవుం డాత్మ సంరక్షణమున నేమఱి యుండఁడు. నే నీ వార్తఁ దెలిపి నాని యాప్తులఁ బంపుదనుక నీవు మృతకళేబరమును గాచి యుండుము. (పోఁబోవ)

విజయ : ఉండుము; ఉండుము. ఇదే శూరసేనుఁ డుత్తాతఖడ్గుఁడై ఖడ్గవ్యాప్రక్రియఁ బరుగిడివచ్చుచున్నాఁడు. జాగ్రత్త! దుర్మార్గుఁడు-నిన్నుఁగూడ...

శూర : (చంద్రశేఖరునిఁ దప్పుకొని పోఁజూచుచుండ)

చంద్ర : (నిల్వరించి)

మ. కుటిలాచారపరాయణా! నిలువు, సంకోచింప కేమంచుఁ బ్రా
కటసంగ్రామవిరుద్ధధర్మమునఁ ద్వత్ ఖడ్గంబు వర్తించె? మ
త్పటుబాహాబలబాడబానలము తత్పాపప్రణాశంక్రియో
ద్భటసంకల్పముమై క్షమాగుణముఁ బోవం ద్రోచి జృంభించెడిన్.
(లేడిపై దుముకు సింగంబు జాడ శూరసేనుని పైఁబడి వధించును)

పరమచండాలా!

ప్రీణయాదర్శము

శ్లో. "త్రిభి ర్వర్షై స్త్రిభి ర్మాసై స్త్రిభిః పక్షై స్త్రిభి ర్దినైః
అత్యుత్కటైః పుణ్యపాపై రిహైవ ఫల మశ్నుతే.
అన్యాయత్త చిత్తయోర్ధృతధ పాపభారము మూడుగడియలకే వీనికిఁ గట్టి కుడిపినది.
(నిష్క్రమింతురు)

## ద్వితీయరంగము

[అంతఃపురోద్యానవనము]

హేమ : (పుష్పాపచయముఁ జేయుచు ప్రవేశించును) బళిరే! వసంతకాల సాయం సమయమలయ సమీర కుమారులు, నానానేక వన్యప్రసూన సుగంధామ ధువమదోన్మత్తులై, తరుణ మందారరజోరాగ పరిభాధురతులై, మన్మనోమోహన కాతిథేయులు గాఁ బ్రియత్నించుచున్నారు. ఖర్జూర క్రముక నారికేళ రంభా సురభి తమాల పున్నాగ వకుళ వృక్షనికర పరీవృతమై, మల్లె మొల్ల విరజాజి ద్రాక్ష చేమంతి మాలతిరేరాణి పూదీవియల మొత్తము లల్లుకొని యుల్లం బలరింప మొల్లమై విరియఁ బుష్పించిన కేతకీ పారిజాత జపా చాంపేయ నాగలింగ పుష్పద్రుమాకీర్ణమై నైసర్గిక సౌందర్యాభిరామమై, యొప్పు నియ్యుపవనంబున భర్తృసహిత స్వేచ్ఛావిహార సంతోష సమన్విత నైన సార్థకజన్మను. పొద్దు జాఱుకొలంది బుద్ధి హద్దు పద్దు లతిక్రమించు చున్నది. చిత్రము.

తే. గీ. స్వాశయానుకూలోన్ముఖక్షణమునందుఁ
జిత్తము ద్వేగతప్తమై తత్తరించె
మొలక నాటునప్పటికంటె భూజ మెదిగి
ఫలమొసఁగువేళఁ గామంబు బ్రబలుభంగి.

అచిరంబునఁ బ్రియచరణారవింద సేవాభాగ్యమునకు నోఁచుకొందును ఈ లోన నవమల్లికామాలికం గట్టి భర్తృగళంబున శృంగారించెద. (పుష్పాదుల గోయు టభినయించి) కేతకీదళంబుల నీలాంబరి గుత్తియ మాచిపత్రితోఁ బొదివి యంగారక కుసుమ గుచ్ఛములచే సూత్రింపఁబడిన గులాబీ సుమంబు మేరుపదంబున నిల్పి కీల్గొప్పున నలంకరించుకొని భర్తృ మనోరథ మాళ

క్షింతును. నా కిఁక విరామము లేదు. (పుష్పాపచయము నటించి) ఇంక నేను బ్రియ స్త్రవస్త్రాభరణములఁ దాల్పవలయును. సుమసరముల సిద్ధపఱచ వలయును. నాకు సహాయ మగుటకు మహాలక్ష్మి యెందేగెనో? దేవాలయమునుండి వచ్చినపైఁ గాన్పింపదయ్యె. సూర్యభగవాను డస్తాద్రిఁజేరెను. చంద్రశేఖరు డాలసింపడు. నేను త్వరపడియెదఁగాక. (వడివడి సౌధ మెక్కి శయనాగారప్రాంగణమున మాలలఁ గ్రుచ్చుచుండును.)

(నేపథ్యమున)

హేమలతా! హేమలతా! ఇం కేమున్నదే? కొంప మునిగినది.

(మహాలక్ష్మి ప్రవేశించును)

హేమ: (ఎదురై) మహాలక్ష్మీ! ఈ పాపంపుగర్ణంబు లేమి యప్రియము వినవలసి యున్నది?

మహా: నుడువ నోరాడదు. సర్వనాశన మైనది.

హేమ: అయ్యో! నన్ను వేధింపకుము. మదిష్టదైవతము నాయం దంతటి కఠినుఁ డయ్యెనా?

మహా: భగవంతుఁ డనుకూలుం డైనను జంద్రశేఖరుఁడు మాత్రము నిర్దయుఁడు. హా! చంద్రశేఖరా!

హేమ: కట్టా! కడ తేఱితి. (దుఃఖించును)

మహా: హేమలతా! ఎంతటి దురదృష్టవతుల మే మనము!

హేమ:

క. పరిపరి విధములఁ జేతః
పరితాపం బినుమడించె స్పష్టంబుగఁ ద
చ్చరితం బాద్యంతము స
త్వరముగ విశదీకరింపఁ బ్రణతు లొనర్తున్.

అవ్యక్తవిషయ మహాసంక్షోభసముద్రంబున నల్లాడుచుంటి. బ్రదికింపుము.

మహా: వెఱ్ఱితల్లీ! చనినవారిం గొనివచ్చు టెట్లు?

హేమ: ఆఁ – ఆఁ – ఏమీ! కలయా! (మూర్ఛిల్లును)

మహా: (శైత్యోపచారము చేయుచు) బిడ్డా! పొరపా టేమున్నది. క్షతవక్షఃస్థల నిర్జీవశరీరము నా కన్నులఁ జూచి వచ్చితిని (హేమలత మూర్ఛదేరగా) ఆబాలగోపాల మూరంతయు మారుమ్రోగుచున్న దీవార్త.

హేమ: దీనబంధూ! నా బ్రతు కేమి కావలసియున్నది?

మహా: ముందింకేమి గావలయు? శూరసేనా కాలమరణోదంతము, చంద్రశేఖర పురబహిష్కార వృత్తాంతము. చాలవా?

హేమ: మతిభ్రష్టురాలా! ఈ యుదంతమున కీ యుపోద్ఘాతం బేమి? ...... సరిసరి...... చంద్రశేఖరా! ఎంతటి నిర్దయాళుండవు! ఎంతటి సంకుచితాత్ముండవు? ఎంతటి మిత్రద్రోహివి? మూఁడుగడియలకుఁబూర్వము దేవాలయంబునఁ జేతఁ జేయుంచి, కాలుఁ ద్రొక్కి, క్షీరఘృతంబుల సోఁకి యగ్నిసాక్షి, నన్వరిగ్రహియించి నా పై నించిన యనుగ్రహమంతయు బాహ్యప్రకటనమా? మనోధవా! జిలిబిలి పలుకులయందలి మాధుర్యము—వదనాంభోజమునఁ దాండవించు నిష్కల్మషత్వము - అవయవములయం దలరారు శిరీష కుసుమపేశలత, హృదయపీఠిఁ గర్కశాకారముఁ దాల్చెనా? మానవగుణావగుణములు కేవలబాహ్యలక్షణముల నూహించుట యెంతయు పొరపాటు. హా! శూరసేనా! హేమలతా చంద్రశేఖరుల మైత్రికి నీ మృతి ప్రతిఫలమా? భవదాకారము మా దృక్పథంబునుండి నిర్గమించెనా? కన్నులుండియు ని న్నీ భౌతిక ప్రపంచంబున సందర్శింపఁ జాలనా? ఎట్టి యకాలమరణంబునకు లోనైతివి? (దుఃఖించుచు) ఛీ! ఛీ! నేత్రంబులారా! బైసిమాలి యంబుధార లేల గురిసెదరు? మద్దుఃఖావేశమునకుఁ బునాది యెద్ది?

తే. గీ. ఒకఁడు మేనత్తకొడుకు వే ఱొకఁడు భర్త
వైరభావంబులన్ దలపడిన వేళ
నెవని కొఱకని వాపోవు దింత కేను
శ్రీశుఁ డొకకంట నద్దరిఁ జేర్చెఁగాని.

శూరసేనుఁడు ఖడ్గమృగప్రకృతివాఁడు. కయ్యమునకుఁ గాలుఁ ద్రవ్వియుండు, ప్రియుఁ డాత్మసంరక్షణఁ బ్రవర్తిల్లఁబోలు. లేకున్న మన్మనఃప్రమదాకరుఁ డేమి? నా కగ్గొనర్చు టేమి? కల్ల. మేనత్తకొడుకైన నేమి? సాక్షాత్సోదరుఁ

డైన నేమి? మత్ప్రధానార్ధాంగళత్రులై, శేషార్ధాంగమిత్రమాత్రుండా? అహితాంతము సంతాపోదంతమా? కనుక స్వాంతమా! దూరమాలోచించి యొక విధమున సంతసింపవలసిన నీవు పరితపించుట కెట్టి. నేత్రాంబువులారా! ఉపసంహృతి నొందుఁడు.

మహా: హేమలతా! ఏమంటి వేమంటివి? నీ కిది సంతోషసమయమా?

హేమ: కాదా! భర్తబ్రదుకు సంతోషావహము గాక సంతాపకరమా? మరియు శూరసేనుని మరణముకంటెను భర్తృ బహిష్కారవృత్తాంతము వేయి మడుంగు లధికమై సర్వమును మఱపించుచున్నది. సహస్రశూరసేన వధ కథా విధానముగూడ చంద్రశేఖర బహిష్కారతుల్య దుఃఖభాజనము గాదు. నాకుఁ బ్రపంచమే మునిగిపోయినది. హేమలతకు భర్తృవియోగ మనఁగ భౌతికశరీరవియోగ మనినమాట. ఈ జన్మమున కిఁక భర్తృదర్శన భాగ్యమునకు నోఁచుకొననైతిఁ గాఁబోలు.

మహా: బిడ్డా! అధైర్యపడకుము. నే నీ రేయి నెంతప్రొద్దయినను జంద్రశేఖరుని దోడ్తెచ్చెద. సర్వమును సిద్ధము. సౌధారోహణానుకూలపాశనిశ్రేణియు నిర్మించితిని.

హేమ: మహాలక్ష్మీ! ఆయన నా మొగముఁ జూచుటకు సంశయించును. తన్నిష్కళంకచరిత్రానర్హదూషణాఘసమన్వితనైతిని. నీ వేఁగి వారికీ ముద్దుటుంగరము సమర్పించి,

సీ. ననుఁ గన్నవారి ప్రాణంబు లాయన హరిం
చెనుగాక నేను ద్వేషింప ననుము
ఎవరి నోసటి వ్రాఁత కెవ్వారు కర్తలు
శూరసేనునికర్మ దీరె ననుము
తన బహిష్కార వృత్తాంతంబు దుర్భర
హృదయశల్యమయి కారించు ననుము
ఎవ్వ రేమనుకొన్న నేను మాత్రము తన
పరిశుద్ధభావంబు నెఱుఁగు దనుము

## ప్ర ణ యా ద ర్శ ము

రాత్రి తన దర్శనంబు దుర్లభమయ్యెన
నేను జీవించియుంట సందేహ మనుము
శాశ్వతానంద మిడఁగఁ దాఁ జాలకున్నఁ
దవిరి యొకనాఁటి ముద్దైనఁ దీర్పు మనుము.

మహా: సరే, నీ వింత చదువుఁ జదివిన నేను బోకుందునా?

(చెరియొక వైపున నిష్క్రమింతురు.)

## తృ తీ య రం గ ము

### సదానందుని దరీగృహము

[చంద్రశేఖర సదానందులు దొడ్డిగుమ్మముకడ ప్రవేశింతురు]

చంద్ర: తాతా! నేఁ డెంతటి దుర్దినము! ప్రాతఃకాలమున నెవరి మొగముఁ జూచితినో కాని సర్వనిర్ధూమధామ మైనది.

మ. పరమద్రోహిని నేను హేమలత నాశ్వాసింతు నెబ్బంగి? నా
కొఱకై ప్రాణము ధారవోయుటకు సంకోచింప, దేనో? సుము
ష్కర చిత్తద్విజదుగ్రకర్మమునఁ దత్సంబంధి హింసించి యు
ద్ధురదోషాచరభావ మొందితి, మహాద్రోహంబు గావించితిఁ.

నా పురబహిష్కరణవృత్తాంతము నన్నెంత మాత్రమును సంచలింపఁ జేయలేక పోయినదిగాని, నన్విడచి గడియఁగడుపఁజాలని యా యమాయికస్వభావ, యా నిర్మలానురాగసంకలిత, యా మౌగ్ధ్యపరిపూరితహృదయ నా చెయిదము దలపోసి నా బహిష్కృతిశిక్షాకథావిధాన మెఱింగి యెంత పరితపించినదియో? ఎంతటి సాహసమునకుఁ గడంగినదియో? ఎన్నెన్ని దేవతల కేమేమి మ్రొక్కుకొన్నదియో యని మాత్రము, వేలాతిక్రాంత తీవ్ర దుఃఖ తరంగ సంక్షుభితమనస్సాగరుండనై శాంతిఁ గనక యితి కర్తవ్యతామూఢుఁడ నైతిని.

## తృతీయాంకము

సీ. దేవ్యాలయమునుండి తీరుగ స్వగృహాభి
ముఖుఁడనై నే నేల పోవనైతి
పోనైతి పో, లేనిపోనిపెత్తన మూని
పో రడంపఁగ నేల పూనుకొంటి
పూనిన నేమాయెఁ బో, శూరసేనుఁడు
గిల్బిషవృత్తిం దెగింప నేల?
తెగియించె నేమి, శాంతింప కేనేల దు
ష్కృత్యంబు కొఱకు కుత్సహించినాఁడ
నాగ్రహోద్విగ్న కార్యం బటంచు క్షాంత
లేకుఁ డేటికి నకట క్షమియింపఁ డయ్యె
మూఁడుగడియల మురిపెంపుముచ్చ టనఁగ
బరిణమింపఁగ నయ్యె మా పరిణయంబు.

సదా : కుమారా! అత్యంతవ్యాకులభారంబునఁ గర్తవ్యము మఱచుచున్నావు. నేఁటి వేకువనుండియు సౌగంధద్వీపమునకుఁ బయనంబుఁ గావలయునని రాజాజ్ఞ. తెల్లవాఱిన నీవీ పట్టణపరిసరప్రదేశములందుఁ గానరాఁగూడదని బహిష్కార పత్రికాదేశము. ఈలోన నీవొకసారి హేమలతను జూచియైన రావలదా?

చంద్ర : చూచిపోవలయునా? హేమలతను గాదు, మృత్యుదేవత నను ము.

తే. గీ. జీవితేశ్వరి కపకృతి సేయు టన్న
నాత్మహత్య సల్పుకొనినా నను కెగాన
బ్రదికి యుండియుఁ దీఱినవాఁడనైతి
తదవశిష్ట మీ తరవారి దలఁగఁద్రోయు.

(ఖడ్గ మొఱనుండి పెఱికి స్వాత్మహత్యకు సన్నద్ధుఁ డగును)

సదా : (వారించి) వెఱ్ఱివాఁడా! శాంతింపుము. కేవలము దుఃఖాతిరేకమున శాస్త్రంబు నతిక్రమింపకు. ఆత్మహత్య మహాపాతకము. అప్రస్తుతవ్యసనమునకుఁ జిక్కకుము.

ప్ర ణ యా ద ర్శ ము

శ్లో. జాతస్యహి ధ్రువో మృత్యు ర్ధ్రువం జన్మ మృతస్యచ
తస్మా దపరిహార్యేఽర్థే న త్వం శోచితు మర్హసి.

అని నీ కిపుడు బోధింప వలయునా? నీ కీ ధర్మ సిద్ధాంతము లన్నియుఁ గొట్టిన పిండియే గదా! మరియు.

శ్లో. అవ్యక్తాదీని భూతాని వ్యక్తమధ్యాని భారత!
అవ్యక్తనిధనాన్యేవ తత్ర కా పరిదేవనా?

అనఁబరగు శ్రీకృష్ణప్రోక్తనీత్యర్థము నీకుమాత్రము గ్రహణయోగ్యము గాదా? జీవపదార్థము నెలయించికొని పోవు మాయావాగురం జిక్కి మోహాంధకారనిమగ్నుఁడవు కాక జ్ఞానభాస్వత్కిరణప్రబోధితుండ వగుదువు గాక.

చంద్ర: కనుల నీరుడుచుటకు శ్రుతిస్మృతిపురాణేతిహాసములు గలవు. ఆచరణలోనికిం దెచ్చుటే యవతారపురుషులకో తప్ప ప్రాకృతుల కసంభవము. కడుపుచుమ్మలువారు దుఃఖమును వేదాంతములు శాస్త్రములు ననునయింప నేరవు. వివాహానంతరము మూఁడు గడియలకు మూఁడిన యీ కీడు దుర్భరము. నా సంతాపమునకు స్వస్తి నా జీవితాంతము. తలఁపునకు వచ్చిన గుండె వ్రయ్యలగు చున్నది— నా మిత్రద్రోహమునకు క్షమాపణ లేదు. శూరసేనకంఠలుంఠనాకుంఠక్రియానిర్వహణబలీయస మైన యీ ఖడ్గము వైరిసంహార సాధనము గాక, హేమలతా చంద్రశేఖరానుకూలదాంపత్య ప్రణయలతాలవిత్ర మైనది. కట్టా!

సీ. అభము శుభ మెఱుంగనట్టి యమాయిక
స్వాంతను మోహదవాగ్నిఁ ద్రోసి
గాంధర్వపరిణయకాలుష్యమున గ్రొగ్గి
తలిదండ్రులకుఁగూడ దవ్వొనర్చి
అనుకూలశత్రువు నై శూరసేనుని
మట్టాడి దుఃఖనిర్మగ్నుఁ జేసి
తలఁ బ్రాలపసుపు హస్తముల మాయకమున్నె
శాశ్వతవిశ్లేషజలధిఁ గూర్చి

తే. గీ. తారకాచంద్రభాస్కరస్థాయిమైన
దుర్యశఃకళంకితచరితుండ నైతి
నే మొగంబున దర్శింతు హేమలతను
బిడియపడి చావ కెట్లు జీవింపనేర్తు.

సదా : అజ్ఞుఁడా! దుర్యశంబును జచ్చి మాత్రము దప్పించుకొనఁ గలవా? కాలసన్నిహితము గానిది నీకు మరణింప సాధ్యమా ? శివునియాజ్ఞ లేక చీమయైనఁ జావదు. చంపఁబడదు. చంపలేదు. నీ వేమిరా శూరసేనుని నేను జంపితి, నేను జంపితి నని మాటిమాటికి నహంకరింతు వేల? ఒకరిని జంపుటకు గాని, యొకరిచేఁ జంపబడుటకుఁగాని మన మెవ్వరము? నీకు నాకుఁ గర్తృత్వమే యుండిన నికఁ జెప్పవలయుగా? శూరసేనుఁ డీ ప్రపంచనాటక రంగస్థలమునఁ దనపాత్రఁ బ్రదర్శించి నిష్క్రమించెను. ఎవఁడు దీనికిఁ గర్త? నీకంతటి కర్తృత్వమే యున్నచో నేఁడే! నన్ను వధింపుము. కాదా! శూర సేనుని బ్రదికింపుము. నేదా! రాజాజ్ఞఁ దప్పించుకొనుము. ఏదియుఁ జేయ నేరవు. నీవు ప్రకృతిక్రీడావస్తువవు. పరదేవతాలీలావిశేషంబు లగ్రాహ్య ములు. ఎట్టిదైన నిదమిత్థమని నిర్ణయింప మన మనధికారులము. భగవదిచ్ఛ ననుసరించి సర్వమును జరుగును. మానవప్రయోజకత్వము హులిక్కి. (తనలో) దుశ్శకునము లని నెత్తిన నోరుఁ బెట్టుకొని మొత్తుకొనిన విని నాఁడా?

(తెరలోఁ దలుపుఁ దట్టిన ధ్వని)

చంద్ర : (కలతఁజెంది) ఆ ధ్వని యేమైయుండును ?

(తిరిగి ధ్వని)

సదా : కుమారా! రాజభటు లేమో? వారి సంకల్పము నిన్నిప్పుడే పురము వెడలింప వలయు ననియా యేమి? ఆ గదిలోనికిం బొమ్ము. తలుపు దెఱచెదను.

(తలుపుఁ దట్టుచుఁ దెరలో) సదానందస్వామీ! సదానందస్వామీ!

సదా : ఎవరు వారు?

(తెరలో)

నేను మహాలక్ష్మిని.

సదా : ఇదిగో! వచ్చుచున్నాను. (పరిక్రమించును)

చంద్ర : హాతోస్మి! నే నిపు డీమెతోఁ బ్రసంగించు టెట్లు?

మహా : (సదానందునితోఁ బ్రవేశించుచు) స్వామీ! మా హేమలతప్రియుఁ డేఁడీ?

సదా : ఆ శయ్యపైఁ జేరగిలఁబడి యున్నాఁడు. నే ననునయింప లేకున్నాను.

చంద్ర : మహాలక్ష్మీ! హేమలత యింకను నీ దుర్మార్గునిసంబంధమునకు రోసిపో లేదా? అహా! ఎంతటి మందభాగ్యుఁడను? తానై మద్గృహంబునకుఁ బయన మైన పెన్నిధి కపకృతి నొనర్చితిని. తనుకఁబోయినలవలీలత పాదములకుఁ జుట్టుకొనిన మందమతినై తప్పుకొంటిని. కుంకు లిడవలసిన తీర్థరాజ మెదు రైనంత నెల్లిదముఁ జేసితిని. అప్రయత్నలబ్ధ మాణిక్యమును మట్టిపెల్ల యని పాఱవైచితిని. తత్సతీనవనీతహృదయముపై దారుణఖడ్గాహతినామా శ్రియాశజ్వలజ్జ్వాలామాలికల బ్రసరింపఁజేసితిని. కొఱవితో నెత్తిఁ గోఁకు కొంటిని. నిర్భాగ్యదేవత నాహ్వానించి సుస్వాగతము కైసేసితిని. మహాలక్ష్మీ! అనర్హుఁడ నైనను బ్రశ్నించుచున్నాను. హేమలతావస్థ యెట్లున్నది?

మహా : అయ్యో! రాకుమారా! నీ బహిష్కారశిక్షఁ దలంచి పదివేలమంది శూర సేనుల మరణముకంటెను నెక్కుడు దురవస్థగ భావించి గుండె చెక్కలగు నట్లు కన్నీరు మున్నీరుగాఁ బ్రవహింప, నేలపైఁ బడి దొర్లాడుచు నెట్ట కేలకు ధైర్యముఁ దెచ్చుకొని యామె ముద్దుటుంగరముతోఁ బాటు నీ కీ సందేశ మంపియున్నది.

(ఉంగర మొసంగి "ననుఁగన్న వారి పా" అను పద్యముఁ జదువును)

చంద్ర : (దోసిట నందుకొని యుంగరముఁ గన్నుల కద్దుకొని) మహాలక్ష్మీ!

సీ. ఉపకార మపకారి కొనరించు హేమల
త సహవాసమునకుఁ దగను నేను
తత్ప్రతివ్రత సుహృత్సంకల్ప మీ నర
హంతచే విషమయం బయ్యె నేడు
విపరీతమార్గప్రవేశము మై ప్రణ
యప్రపంచమునకు హాని యయ్యె
ఇంత కృతఘ్నుఁడ నేను బాత్రింబనే
యా చెలి యంగుళీయకము గొనగ

జీవితత్యాగమో? సన్న్యసించుటో ముక్తి
మిగిలియున్నవి రెండె యీ మేటి కిపుడు
నరకమో! స్వర్గమో? దాన దొరయుఁగాక
చిత్తముం బదిలపఱచి సంసిద్ధమైతి.

కేవల ప్రాపంచిక విషయ సౌఖ్యం బుపలక్షించి మానవస్వాభావికప్రమాదము నకుఁ బ్రాయశ్చిత్తముగఁ దనువుఁ ద్యజించి హృదయమందుఁ గల్పించు కొన్న హేమలతాసతీమణితో శాశ్వతానందమును బొందుచు నా ప్రణయ చంద్రిమకున కల్గిన కళంకమును బాపుకొందును. పతికై సహగమన మొనర్చి సద్యశస్సమన్వితలైన సతీతిలకంబుల వలె, సతియెడ నొనర్చిన ద్రోహ కాలుష్యము శాంతింపఁ జేసికొనుటకు బతినైననేను ప్రాణపరిత్యాగ మొనర్చి ప్రపంచమునకు నవీనమార్గదర్శకుఁడనై చిరకీర్తిసంపన్నుఁడ నయ్యెదను. ఒకవేళ నా నిమిత్తమై, స్వప్రాణాధికంబుగ నన్ను భావించు హేమలతయు నన్ననుగమింప సాహసించినచో, స్త్రీహత్యాపాతకమున కొడిగట్టి దుష్కీర్తికి లోనయ్యెద నను సంశయమునులేదు. అన్యోన్య మొకరి నొకరు విడలేక ప్రణయతీర్థయాత్రికులమై భూతాణువులలో గలసి యాత్మైక్యానుసంధాన మొంది, జననమరణాతీతులమై, కీర్తిశరీరుల మయ్యెదము. బహిష్కారకారణమున శాశ్వతవియోగసంతప్తహృదయుండనై, నెచ్చెలి దుఃఖభాజనగా నొనర్చి, సంసారసముద్రంబునం దల్లాడుట కంటె, మిత్రద్రోహమునకుఁ బ్రాయశ్చిత్తము, ఆత్మహత్య – ఆత్మహత్యా ప్రతిఫలము – హేమలతా ప్రాణపరిత్యాగము. తన్మూలమున విదేహ మైన శాశ్వతదాంపత్యానుభవము. లెస్స. ముక్తికిఁ జేరవత్రోవ లభించి నపుడు, దూరపుమార్గమున నేల నడువవలయును? ఇంకను శూరసేనుని రక్తపుఁదడి యారని మన్నిశితకరవాలము నా కంఠశోణితము గూడ జవిఁ గొని కృతార్థీభూత మగుఁగాక.

మహా: ఓయీ! పురుషోచితకృత్య మది గాదు. బిరుదుమగవాఁడ వని, జన్మాంతర సౌఖ్యసంధానప్రవీణుఁడ వని, నిన్నవలచినదిగాని మా హేమలత, స్త్రీప్రకృతి స్వరూపుఁడ వని చీటికి మాటికిఁ జచ్చెదఁ జచ్చెద నని బెదరింతువని ప్రేమించియుండలేదు. ఈ కృత్యము నీ ప్రియురాలి కానందదాయకము

గాదు. చచ్చినవాండ్రతోఁ గావలసినవాం డ్రందఱు గట్టఁగట్టికొని మరణించవలసినదేనా? మెట్టవేదాంతములు - శ్రీరంగనీతులు - చాలింపుము.

సదా : కుమారా ! ముదుసలిస్త్రీలచేఁ జెప్పించుకొనవలయునా ? నీ వేమిరా యుద్ధరించి పట్టముఁగట్టి పెట్టెద వని, కొండంత యాసతో నున్న హేమలతకుఁ జివరకు భర్తృవియోగదుఃఖ మాపాదింపఁజూచెదవా? మఱి యున్నదియా ?

మహా : లేలెమ్ము! నీ కొఱకు హేమలత క్షణములు లెక్కించుచుండును. సర్వసన్నాహములు చేసి వచ్చితిని.

సదా : ఇఁక సందేహింపకుము.

మహా : అయ్యో! జాగొనరించిన కొలఁదియు నామె కెట్లుండునో విచారింపుము.

చంద్ర : మహాలక్ష్మీ! నీవు నడచుచుండుము. నిన్నొక క్షణములో గలసికొందును.

మహా : నిశ్చయమేనా?

చంద్ర : తప్పదు.

మహా : త్వరపడుము. నాకు సెలవిమ్ము. (నిష్క్రమించును)

చంద్ర : తాతా? నన్నుమన్నింతురా!

సదా : నాయనా! పోయిరమ్ము, పురము వెడలునప్పుడు నాకుఁ గనుపించి మఱి వెళ్ళుము.

చంద్ర : చిత్తము. (నిష్క్రమింతురు)

## చతుర్థరంగము

### హేమలతాదేవీ శయనాగారము

[పాన్పుపై సుఖాసీనులై హేమలతా చంద్రశేఖరులు ప్రవేశింతురు]

చంద్ర: (ఉదరిపడి) ప్రాణపదమా! అదిగో! భరద్వాజద్విజరాజకంఠీరవము. వేగుజాము గాఁబోలు. ఇఁక నే నీ పాలిమేరలఁ గానరాఁగూడదు. రామా! కాముక ప్రథమ సమావేశ యామినీ భామినీ గమనరభస మద్వితీయము. (మంచము డిగ్గుచున్నాఁడు)

హేమ: (వెంటనంటి మంచము డిగ్గి భర్తృకంఠాలింగనమున) ప్రేమాస్పదా! ఇపుడు మనము వినినది ప్రియగీతారావము సుమా! పొరపడుచున్నావు.

చంద్ర: (హేమలతపైఁ బ్రేమైకదృష్టులం బఱపుచు) ప్రేయసీ! భవత్ప్రస్తుత రతాంత తాంతలతాంతగాత్రాభినవమనోజ్ఞాకారము దర్శనీయము.

సీ. సంస్క్రియాదూరనైజద్యుతి ప్రసర ఘ
 ర్మాంబు పెంపు స్తిమితాంబరంబు
సంకల్పభవపాశ సదృశ విశ్లేషిత
 నీరంధ్రకుటిలవేణీభరంబు
దళితకషాయైక ధవళకాంతిస్ఫుర
 దామూలదష్టదివ్యాధరంబు
జాగరోత్పాదిత రాగదీధితి కలా
 స్నిగ్ధనిమీలితాక్షిద్వయంబు
త్రుటితకంచుకోదంచిత పటుతగోరు
సమద వృత్తపయోధరాచలయుగంబు
ప్రతినిమేషోద్యతానంగ శితశిలీము
ఖాగ్రనికషాయమానవికాసితంబు.

(కంఠాశ్లేష మొనర్చును.)

హేమ: (ప్రత్యాలింగనమునఁ గను మాటొనర్చి) ప్రియా! న న్నిట్లు మంచి మేలము లొనర్తువు. నీవు మాత్ర మెట్లున్నావు? నీ వైఖరి నీకుఁ గాన్పింపదు,

క. నొగిలిన గండస్థలములు
పగిలిన బింబాధరంబు భావజకేళీ
స్థగితశ్రమప్రకట దృగ
భిగతవిలాసము మదాత్మ వివశము సేయుఁ.

చంద్ర: ఇది కేవల మతిశయోక్తి. మాటకు మాట బదులాడితివి. అసత్యప్రలాపినివి గాకుండ నీ చెక్కు లెన్ని మారులు నొక్కినను బాపము రాదు.

హేమ: ప్రియా! సత్యాసత్యవిమర్శనయోగ్యముకురఫలక మందిచ్చెద. (ముకురముఁ దేఁబోవ)

చంద్ర: (పోనీయక) కల్పితదర్పణ మేల? భవదీయ నైసర్గిక కపోలముకుర ఫలకంబుల నా రూపము ప్రతిబింబించుఁ గాక. (ముద్దాడఁ బోవును)

హేమ: (మాఱుమొగంబై) నే నట్లు లంగీకరింపను. జయాపజయంబులకుఁ బన్నిద మొద్దుము.

చంద్ర: సందియం బే మున్నది. నీవు గెల్చితివేని నీ దాసానుదాసుండ నయ్యెదను. ఏదీ! నీ పన్నిదము?

హేమ: నే నోటువడిన నీ ప్రియురాలి నయ్యెద.

చంద్ర: ఆ! ఏమి నీ చమత్కారము. ఇపుడు గానో?

హేమ: అట్లయిన నీకు మాత్రము దాసానుదాసత్వ మింతకుముందే సిద్ధింపలేదో?

చంద్ర: బేలా! నిన్న నేఁటికే యెంత మాటకారి వైతివి?

హేమ: (నవ్వుచు) ఈ నేర్పంతయు నేటిదే యైన నీ చలువయే గదా?

(భరద్వాజ పక్షి కూయును)

చంద్ర: నెచ్చెలీ! ఇంతకుముందు భరద్వాజము గాదంటివి. చూడు. ప్రాగంగన నీ సవతిరీతిఁ గెంపుఁగందోయితో, దిక్తటాంధకారపటాచ్ఛాదనాతిక్రాంతయై నిన్నెదుర్కొనుచున్నది. భరద్వాజముగూడ రెట్టించి రెట్టించి కూయుచున్నది. నాయునికి ప్రాణాపాయ కారణము. కట్టా! రాజశాసనము దురంతము, దుర్భరము, దురతిక్రమణీయము.

హేమ: (కనులనీరు గ్రమ్మికొనుచుండ) ప్రాణమా! ఆకల్పస్థాయిగా లక్షించిన మన సౌఖ్యానల్పసంకల్పము వికల్పమైనందులకు వగచెదను. కానిమ్ము.

## తృతీయాంకము

సీ. విశ్లేషదుఃఖాప్తి వీతనిద్రాహార
జీవివై కుంగి కృశింపకయ్య
కాకిచేఁ గబురంపఁ గల్గినఁజాలు నీ
మ్రోల నెక్కలఁ దాల్చి వ్రాలెదయ్య
ఏనాఁటి కానాఁడు మానక నీ క్షేమ
వృత్తాంతము లనుగ్రహింపు మయ్య
సంసారసుఖ మశాశ్వతము నిత్యానంద
భూతికై యత్నింపఁబోలునయ్య

తే. గీ. తల్లిదండ్రి గురువు దైవతంబ వనుచుఁ
ద్వత్పదాబ్జసేవాధీనభావరూఢి
జీవిత తరణోపాయ మాసింతునయ్య
పోయి రావయ్య దయ నించి ప్రోవుమయ్య.

(ప్రణమిల్లి కన్నీళ్లతోఁ బాదముల దడుపును)

చంద్రి: (కన్ని గద్దుకొనుచు) మనోనాయికా! ధైర్య మవలంబింపుము.

(ప్రియురాలి లేవఁదీసి కురులు చక్కనొత్తుచు)

సీ. ఈశరీరం బెట కేగిన నీయందె
చిత్తంబు మాత్రము హత్తియుండు
నమ్మకద్రోహ మొనర్చినా నని శూర
సేనునిఁ దలఁచి దూషింపఁబోకు
ప్రాణపణంబుగా నైనను స్వాత్మీయ
శీలరక్షణ మపేక్షింపు మీవు
పరమేశ్వరప్రీతి ప్రసరించినఁ బునస్స
మాగమ మీలోకమందె కలుగు
స్వప్నమందైన నీ నామసంస్మరణమె
కలితతారకమంత్రంబుగాఁగ నాకు
జన్మసార్థక వర్తనోత్సాహి నౌదు
వెళ్లివచ్చెద వగవ కంపింపు మబల.

(అన్యోన్యపరీరంభు లగుచున్నారు)

## ప్రణయాదర్శము

హేమ : ప్రాణేశ్వరా! ఇప్పుడే రాఁగలను. ఒకసారి విడువుము.

(ప్రక్కకిరిందనున్న తన ఛాయాపటముఁ దెచ్చి భర్తచేతునం దుంచును)

చంద్ర: (చూచి బ్రియత్నించుచు) ప్రియా! ఏమిది?

హేమ : నీవు చూడఁగూడదు.

చంద్ర : ఎందనుకు?

హేమ : నీ వీ పురము విడచునందాఁక.

చంద్ర: ఎందువలన?

హేమ: అది నా యాజ్ఞ.

చంద్ర: ప్రియాజ్ఞ శిరసావహించెదను.

హేమ: (కౌగిలించి నవ్వుచు) నాథా! ఏ మున్నది. నా చిత్తరువు.

చంద్ర: (చూచి) జీవకళ లుట్టిపడుచున్నవి. చంద్రశేఖరునకు హేమలత చిత్తరువుతో నేమి పని? మూలము గలుగ ననుకరణ మేటికి? అయినను,

ఉ. కోరి భవత్ప్రభావిమలకోమలసౌష్ఠవగాత్రవిస్ఫుర
చ్ఛ్రీరమణీయరూపపరిచింతనచిత్రితచిత్తపత్రసం
ఛారుఁడ నయ్యు త్వత్కరసమాగత వస్తువిశేష మిద్ది బం
గారము గాఁగఁ గప్పుకొని కన్నులఁ బూవులఁ బూజఁ జేసెదన్.

(చిత్తరువు గన్నుల కద్దుకొని భద్ర మొనర్చును.)

హేమ : ఆర్యపుత్రా! తరించితిని.

చంద్ర : దేవీ! నీవు కాదు, నా వంశీయులు దశపూర్వము, దశాపరము తరముల వారు మత్కులవిభూషణంబ వైన నీచేఁ దరించినారు.

హేమ : నాథా! గుండె రాయి నొనర్చుకొనినను, భవన్నిర్గమన వృత్తాంత స్మరణ మాత్రమున సంక్షుభితే మగుచున్నది. ఏమిచేయఁగలను?

చంద్ర : అయ్యో! ఏమిచేయఁగలవు? విధి చెయిదములు సర్వంబును మంచికొఱకే యని భావింపవలయు. "నహి సుఖం దుఃఖై ర్వినా లభ్యతే" అను వాక్యము మతికిఁ దెచ్చికొనుము. చీఁకటి వెన్నెల లట్లు కష్టసుఖము లస్థిరములు.

(నేపథ్యమున)

హేమలతా! నీతల్లిదండ్రులు మేల్కొనినను నీ వింకను జాగ్రదవస్థఁ బొందకున్నావు. త్వరపడుము. ఉషఃకాల తేజఃప్రబోధిత వైనఁ గాకుంటివి.

## తృతీయాంకము

హేమ: (త్వరపడుచు) గవాక్షమా! ప్రాణనాథుని వెడలి పోవనిచ్చి, దిననాథుని లోనికిం బ్రవేశింప నిమ్ము (గవాక్షము మూయును.)

చంద్ర: దేవీ! మన చరిత్ర మతివిచిత్రము. చూడు.

తే. గీ. స్థిరపరస్పరప్రణయైకసిద్ధి మొన్న
పరిణయోత్సవోద్బంధనప్రాప్తి నిన్న
బంధురవియోగదుఃఖానుభవము నేఁడు
ప్రకృతిలీలానుమేయవ్యవస్థ ఱేపు.

క్షణక్షణపరివర్తి తాగమ్యగోచరజీవితులము. ప్రియా! ఇఁక నే నాలసింపఁజనదు. చివరముద్దు-తుదికౌఁగిలింత-కడసారి స్పర్శసుఖము-సర్వమిదియ ... ... (ముద్దాడి పరిరంభించును.)

హేమ: (గాఢాశ్లేష మొనర్చి) నీ వియోగ సమయక్షణము నంగన్నెన్నియో దినము లిమిడియుంచును. అవకాశమైనపు డెల్ల దేవర ప్రణయైకపత్రమునను నోఁచుకొందును గాక.

సీ. వ్రీడాభరవ్యాప్తి వెనుకాడి శయనమం
దిరమున నింపు సంధింపనైతి
మన ముద్దుముచ్చట లగని శ్రీశునకుఁ గన్ను
గుట్టు నటంచుఁ గన్పెట్టనైతి
మత్పూర్వజన్మకర్మపరిపాకం బింత
దిక్కుమాలిన దంచుఁ దెలియనైతి
దాంపత్యసౌఖ్యంబు దనివైనఁ గన్నారఁ
జూచుకొనుటకైన నోఁచనైతి
వనజజుపరీక్ష లెల్లను వమ్ముచేసి
నాకలోకానుభవమార్గ మనుసరింతు
విలయ మొదఁగూడదుఁగాక హేమలతచిత్త
శుద్ధిమాఱదు నిశ్చింత బుద్ధిఁ జనుము.

నా పొరపాటులు - నెఱసులు - చనవులు భరింపుము.

(ప్రణమిల్లును)

ప్రణయాదర్శము

చంద్ర: (లేవదీసి) సద్యశస్సమన్విత నయ్యెదవు గాక. ఇఁక నన్ననుమతింపుము.

(త్రాడు నిచ్చెనపై దిగుచున్నాఁడు)

హేమ: చంద్రా! మరల మన కేనాటికైనఁ బునస్సమాగమ సంతోష మొనగూడు నను నమ్మక మున్నదియా?

చంద్ర: దేవీ! నిరుత్సాహ పడకుము. మన దుఃఖములే శుభారంభములుగ నచిర కాలంబునఁ బరివర్తితము గాక మానవు.

హేమ: ప్రాణేశ్వరా! నా హృదయము కళంక భూయిష్ఠమై యపాయమును శంకించుచున్నది. అయ్యో! నీవు నా కంటి కిప్పుడు పాతాళ ప్రేతభూమి నున్నట్లున్నావు. నీమొగము రక్తహీనమై పాండిమము వెడలఁగ్రక్కుచున్నది. కట్టా! చూడఁజాల.

చంద్ర: జీవితేశ్వరీ! నీవు నాదృష్టికి స్వర్గారోహణ మొనర్చుక్రియఁ గాపట్టుచుంటివి. ఆ కాలవియోగపరితాపాతపము మన రక్తము సంపూర్ణంబుగ నాస్వాదించినది. చెప్పమఱచితిని. కార్యావసరముల స్వామి మంతనం బపేక్షింపుము. దైవమున్నాఁడు—నిర్భీతి నుండుము. నీపేరు నిల్పుకొనుము. నాపైఁ బ్రేమ నింపుము. వెళ్లివత్తునా?

హేమ: మహాప్రసాదము. నా యదృష్టరేఖ నిర్గమించినది. అదృష్టమా! నీవు చపలస్వాంతవు. విశ్వాసయోగ్యస్థిరచిత్తచంద్రశేఖరాశ్రయానర్హవు. ప్రాణేశ్వరసత్వరపునస్సమాగమప్రాప్తసంతోషసమన్విత నయ్యెదను.

(నిష్క్రమించును.)

చంద్ర:

సీ. విధివిరామము లేకఁ బెనచుకొనిన నిర
భ్యంతరపుఁగవుంగిలింతలార
హద్దుపద్దుల మీఱి తద్దయు సుద్దమై
యొద్దిక జూపిన ముద్దులార
క్రిందుమీ దెఱుఁగక శ్రీసూనుగర్వంబు
గిందొనర్చిన ప్రహః క్రీడలార
కారణ మెదియేనిఁ గల్పించుకొని పైఁ బ
డందలచు మరువేడబములార

నేఁటికే స్వస్తి వచియించి నిర్గమించుఁ
జంద్రశేఖరుండు దురదృష్టంపుగలిమి
మాటిమాటికి నెచ్చెలి మతికిఁ దెచ్చి
యాగడ మొనర్పఁదగదు, నా యాన మీకు.

(నడుచుచు) కట్టా! సౌగంధద్వీపావాసదీక్షానిర్వహణము సాధ్యమా? ఛీ! భగ్న
మనోరథుండను. (పరితపించుచు నిష్క్రమించును.)

# ప్రణయాదర్శము

## చతుర్థాంకము

### ప్రథమరంగము

[అంతఃపురమున విక్రమవర్మ, తారాబాయి ప్రవేశింతురు.]

విక్ర : మొదటినుండియు నీవు చూపిన గారాములే పిల్లదానిని నేఁ డింత మారాములలోనికి దింపినవి. రెండు లెంపలను వాయించి యొప్పింపఁ దగిన వయసుఁ గలదానిని నీవు సర్వవిధములఁ జేతికి రాకుండఁ జేసితివి.

తారా : మగవారలకు మగువలు లోకువ. నేఁ జేసిన దేమున్నది? ఇపుడు మాత్ర మేమి మిగిలిపోయినది? మీరు కఠిన భావంబున నేఁ డాపె యుద్దేశమును మరలింపఁ బ్రయత్నింపరాదా? వద్దనిన దెవ్వరు? మందలింపరాదా?

విక్ర : ఇంతమాత్రమునకు బ్రయత్నింపవలయునా? మందలింపవలయునా? నా నోట మాట వచ్చియు రాకమున్నే గోపాలవర్మను భర్తగాఁ బూజింపఁ గలదు. రానిమ్ము.

తారా : మఱియు మంచిది. అదిగో! అమ్మాయిని వెంటఁగొని మహాలక్ష్మి వచ్చుచున్నది.

[హేమలతా మహాలక్ష్ములు ప్రవేశింతురు]

మహా : అమ్మా! నేను సెలవు గైకొందును.

తారా : పోయిరమ్ము.

(మహాలక్ష్మి నిష్క్రమించును.)

హేమ: తలిదండ్రుల పాదంబులకుఁ బ్రణమిల్లుచున్నాను, (ఆత్మగతము) అయ్యో! ప్రణమిల్లినను దలిదండ్రు లాశీర్వదింపకున్నారు. తండ్రిగారి నేత్రంబులు రూక్షేక్షణములఁ బ్రసరించుచున్నవి. నే నేమి యపరాధ మొనర్చియుందును?

విక్ర : హేమలతా! నీ యతివినయములు, ధూర్తలక్షణములు, నోటిమాటలు, నాసలి వెక్కిరింతలు నాకు గిట్టవు.

హేమ : నాయనా! అకారణాగ్రహ మేటికి?

విక్రమ : అకారణమా! నీ జననితో నీవే మంటివి?

హేమ : తల్లిగారితోడనా? (తల్లి కేసి చూచుచు) అమ్మా! ఏమంటిని?

విక్రమ : ఏమియు ననలేదా?

హేమ : (జ్ఞప్తికిరాక) ఎప్పుడు నాయనా?

విక్రమ : నేఁటి యుదయంబు.

హేమ : ఏ విషయమును గూర్చి?

విక్రమ : నిన్ను నీవే మఱచినట్లున్నది. నీ వివాహసందర్భమున.

హేమ : తండ్రీ! వివాహసందర్భమున నే నేమియు నాభిజాత్యగౌరవహీనప్రత్యు
త్తర మీయ లేదే? ఇట్లంటిని. ఇప్పటికి నెప్పటికి నట్లే యనియెదను.

మ. ననుఁ గన్నారలు తల్లిదండ్రులు స్వతంత్రం బున్న దీ ప్రాణిపై
ననుఁ జామొత్తఁగనేని, నందులకు సన్నద్ధంబె; పేరూరు లై
నను నే నింతకు మున్నె ఱుంగ కెటు మన్నాథుండు గాఁగోరు దా
ననుః రారాజగుఁగాక యోర్తునె మదంతర్వృత్తి వైరుధ్యముల్.

విక్రమ : నీ యంతర్వృత్తిపై, నవమాసములు మోసి, కని, పెంచి, పెద్దఁజేసిన జనని
జనకుల మగు మా కధికారము లేదంటివి. ప్రాణంబులు భవదధీనం బౌన
ట్టును గాని గోపాలవర్మను మాత్రము గ్రహింప నని నీ మతము. ఎందులకు
నీ కీ పెంకెతనము? కన్నైన విష్ణుని పసికూనల కెంతెంత మాటలు వచ్చు
చున్నవి? ఊరకొనిన శృతి మించి రాగమునఁ బడుచున్నది. సరి-సరి.

హేమ : తండ్రీ! కోపం బుపసంహరింపుము. నా పరిసంగము హేతుబద్ధము.

సీ. చచ్చునందాఁక సంసారసాగర మీదు
భారంబు నా తలపైని నుంట
కష్టసుఖంబు లెక్కడఁ గలవో యెఱుం
గం దగినంత విజ్ఞాన ముంట
కాలకర్మములు గోపాలనామాభిఖ్య
వణమె సౌదర్యభావ మిడుచుంట

కయ్యము నెయ్యము వియ్యము లసమాను
లందు రసస్ఫూర్తిఁ జెందకుంట
రాజపుత్రికరగ్రహాప్రకటచేత
నానసనుగుణాకృతి విముఖస్వాంత నైతి
నిజవరాన్వేషణోద్యోగనియతి సతుల
కింతమాత్రింపు స్వాతంత్ర్య మేని లేదె ?

విక్ర : ఛీ! ఛీ! నోరు మూయుము. మిన్నునున్న కొలఁదిఁ జిలుక పలుకులు విజృం భించుచున్నవి. వియ్య మసమసంయోగమున శోభింప దనెదవు. రారాజ కుమారుఁడు నీ కెం దసమానుఁడు? అయ్యనఘునిఁ దృణీకరించు గుణగణాది వైభవాతిశయములు నీయం దధికముగ నేమి వర్తించుచున్నవి? ఒడ లెఱింగి మాటాడుము.

మ. ఇట నీ యాటలు సాగిరావు హృదయాభీష్టంబు వ్వేత్తైన సం
కట మిం దేమియు లేదు, రాసుతుఁడె నీ కాంతుండు గాఁదగ్గవాఁ
డటు కాదన్నను నిర్వహించెద వివాహం బిద్ది య్యేమైన మ
త్పటుకార్యాచరణత్వదీక్ష యది నీ భావంబునం దెంచుమా!

కాన దూర మాలోచించుకొనుము.

హేమ : (నిర్లక్ష్యంబుగ) తండ్రీ! నేను జక్కఁగా యోజించుకొనియే వచించితిని. రాకుమారునకును, నానును సమత్వ మెట్లు సాధింతువు? వారి వైభవాదుల ముందు నే నెంతటి దాన నని నా యభిప్రాయము.

మ. తలిదండ్రుల్ సుత కీ జలాత్కృతవిరుద్ధబాహ్యార్థంపుఁ బొ
డిలిఁ గంఠంబున నేలఁ జుట్టెదరు? సంతృప్తిప్రథానీతరా
గలసద్భావుకులౌ వధూవరుల సాంగత్యంబు సౌఖ్యంబు గాఁ
గల దీ లాటి వివాహముల్ వితతదుఃఖప్రాప్తిసంస్థానముల్.

కనుక నను క్షమింపఁదగును. జననీజనకులు నా సుఖముఁ గోరెద రేని నీ విషయం బున నాదారి నన్నుఁ బోనీయవలయు. (ప్రణమిల్లును)

విక్ర : తల్లీ! లెమ్ము! నామాటఁ బాటింపుము. సర్వవిధముల గోపాలవర్మ నీ కనుకూలుఁడు. కుల, శీల, రూప, వయో, విభవముల నే కొఱతయులేని పరిపూ

ర్ణుఁడు. పట్టమహిషివి గాఁగలవు. కానక కన్న మదేకపుత్త్రికవు. నిన్నుఁ జూచిచూచి దుఃఖాగ్నిఁ గూలఁద్రోయుదునా? అవ్యక్త కృత్యంబున కేను మాత్త్ర మొడిగట్టుకొందునా? తల్లీ! మద్గర్భక్షీరపారావారోద్భవ వీ వగుటఁగదా రారాజుతో వియ్య మందుభాగ్య మొందనుంటిని. సందేహింపకుము.

తారా: అమ్మాయీ! మీ నాయనగారి హితోక్తులు మన్నింపుము. ఇట్టి వట్టిపట్టుదలల వలనఁ బ్రయోజన మేమున్నది? ఎప్పుడైన మేము నీ బాగుఁ గోరెదము గాని యోగుఁ గోరెదమా? మా సంతానసంతాపము మాయదికాదా? వృథా గృహకల్లోల కారణము గల్పింపకుము. గోరువంకలజతలాగు కలకలలాడుచు వధూవరులు మీర లిరువురు మా కనులయెదుటఁ దిరుగులాడుచుండఁ జూచి కృతార్థులము గాఁగలము. ఆత్మబుద్ధివలన సుఖ మొనగూడినను గురుబుద్ధిచేత విశేష మొడఁగూడు నను నీతిశాస్త్ర మెఱుంగుదువు. అంగీకరింపుము.

హేమ: జననీ జనకులారా! మీ నుడు లెంతమాత్త్రముగూడ నా చెవి దూరుట లేదు.

విక్ర: బిడ్డా! ఏదో యొకరీతి మనసుఁ గుదుటపఱచుకొనుము.

తారా: తల్లీ! అట్లనిన నెట్లు? సర్వ మెఱింగినదానవు. కాలానుగుణముగ నభిప్రాయములు మార్చుకొనవలదా?

హేమ: అయ్యో! తలిదండ్రులారా! న న్నేల నిర్బంధింతురు. మదంతరాత్మకు విరుద్ధముగ నడువలేకున్నాను.

విక్ర: ఇట్టిదానా? అంతరాత్మ - తండ్రిమాట కంతరాయమా?

హేమ: మాతాపితృశాసనము భౌతికశరీరము నరికట్టఁగలదు. అంతరాత్మ జగదంతర్యామికిఁగూడ మర్జయము.

విక్ర: పునరహంభావప్రారంభమా?

హేమ: తండ్రీ! అహంకారము నా కారోపింపఁదగదు. నా కర్మ మెట్లున్న నట్లేయగు. పోనిండు.

విక్ర: అనిన?

పత్నీ ణ యా ద ర్శ ము

హేమ : ఏమున్నది?

సీ. మొఱ్ఱోయనుచునుండ ముడిపెట్టితివయేని
గానంతెగూడ సుఖంబు లేదు
పూర్వసంచితఫలంబునఁ గాని ఇలపు లా
వణ్యావయోనైభవముల రాదు
కర్మానుసారంబుగా బుద్ధి ప్రసరించు
మనుజప్రయత్నాన మాఱఁబోదు
తుద కాత్మహత్యకు దొరకొందుగాక నీ
యభిలాష పరిపూర్తి యైనఁ గాదు
కడకు గోపాలవర్మ పాల్పడుటకింటె
శూరసేననిర్మూలనా ఘోరకర్మ
కారణారాతిచంద్రశేఖరకరసర
సీరుహాగ్రహణాసక్తి క్షేమకరము.

విక్ర : ఆఁ - ఆఁ - ఆఁగు మాఁగుము. మత్కులగౌరవ హరణోద్యోగ నిర్వహణాసురాంశ ప్రభూతకృత్రిమప్రకృతి కాస్వరూపధారిణీ! నిన్నుప్పుపాఁతఁ బూడ్పించెదను. గోపాలవర్మకంటెను జంద్రశేఖరుని యోగ్యత యేమి దగ్గమైనది? ఈవిధల బుద్ధి పెడతల నుండుట సిద్ధము. అస్వాతంత్ర్యదశ యందే యింత తెగువదారితనమునఁ బ్రవర్తించు స్త్రీలకుఁ బురుషులతో సమాన స్వాతంత్ర్యము లభించినపుడు మిన్ను మన్ను గాన్పించునా?

హేమ : అట్లైన స్వతంత్రు లగు పురుషు లిప్పుడు క్రిందు మీఁదెఱుంగకున్నారనిన మాట - తండ్రీ! ఇది కేవలము జాతిద్వేషము. మగవారు సంకుచితాశయములచే, సహజసమానస్వభావ లగు మానినీమణుల నన్యాయ్య మొనరించి, విధిలేక వారు సాహసించి లేని నిట్లాడుట దేశాచారమైనది. సమ స్వాతంత్ర్య సహిత యైననాఁడు స్త్రీ చేతికి రాదనుకొనుట పురుషుఁ డసమర్థుఁ డనుట.

విక్ర : ప్రాణేశ్వరీ! వింటివిగదా దీని ప్రసంగము. సందేహము లేదు. ఇది యౌవన మదోన్మత్త - అన్యాయత్త.

# చతుర్థాంకము

హేమ: అట్లే భావింపుడు.

విక్ర: హేమలతా! అధికప్రసంగము లెందులకు? నీ యంగీకారానంగీకారములతోఁ బనిలేకుండనే నిన్ను గోపాలవర్మ కొసంగి రేపటి దినము వివాహ మొనర్పఁబడును. నీకై నీ వొప్పుకొనిన సరియ; లేకున్న నీకు ఏ దైవము దిక్కగునో? చూచెదను గాక.

హేమ: తండ్రీ! ఎందుకు నీ కింతటి దురాగ్రహము? కోపము మంచిది కాదు.

శ్లో. కోపా ద్భవతి సమ్మోహ, స్సమ్మోహా త్స్మృతివిభ్రమః
స్మృతిభ్రంశా ద్బుద్ధినాశో. బుద్ధి నాశా త్ప్రణశ్యతి.

కనుక నిర్నిమిత్తంబుగ నాగ్రహాగ్రహంబునఁ జిక్కకుము. ఉద్విగ్నచిత్తమున యుక్తాయుక్తముల మాని ప్రవర్తింపకుము. నాకు దిక్కగు దైవమే లేదని హుంకరించెదరు గాని తలంచినచో సర్వమయుం డగు వానికి దుర్ఘట మెయ్యది? భక్తసులభుం డగు శ్రీ మహావిష్ణుమాయ యజ్ఞానాంధకారనిర్మగ్నుల నెంద రెందఱ నుద్ధరింపలేదు? జననీజనకులారా! మీ కెఱుంగని దేమున్నది? భక్తశిఖామణియైన ప్రహ్లాద బాలుని సేవలఁ బరిగ్రహించి వైరభక్తి తన్మయుండైన హిరణ్యకశిపునకు మోక్ష సంప్రాప్తి కారణభూతుఁడై తదనుకూలావతారమున నెందెందుఁ దన సాక్షాత్కార మవసర మగునో యని, యజమానుని యాజ్ఞల కెదురుచూచు భృత్యుని భంగి, సర్వవ్యాపకుఁడై ప్రహ్లాదునకుఁ దన కృతజ్ఞత యెప్పుడు చూపింపఁ గలనో యని, క్షణములు లెక్కించుచు నిజపరివారసతీసుతహితాహిత భయంకర చండ ప్రచండ భీకర దంష్ట్రా సంఘట్టన సముద్భవ వహ్ని జ్వాలాభీలప్రళయమూర్తి ధరించి వేంచేసిన నృసింహస్వామిచరితంబు జదువవా? వినోద వివాద ప్రోత్థిత శ్రీకుచోపరిచేలాంచలము వీడుటయైన నెఱుగక యార్తత్రాణ తత్పరోద్వేగవివేచనాశూన్యుఁడై స్వాశ్రయ నిర్వహణావశ్యక చక్రాద్యాయుధసాధనసామగ్రియుఁ దలంపక గజేంద్ర దీనారవశ్రవణమధుపానవివశగాత్రుఁడై, బయలఁ బరుగిడు నిజచరణ దాసానుదాసదాసుండైన భక్తచింతామణిస్వరూప మిప్పుడు నీ హృదయ ముకురంబున మాత్రము ప్రతిబింబించుటలేదా? నేఁడు నాదిక్కు మొక్కు గూడ నా పక్కయెక్కిరింతసామియే.

విక్రమ : ఔరా! పిల్లవచ్చి గుడ్డును వెక్కిరించు దినములు వచ్చినవి. నిన్నని యేమి ప్రయోజనము? కాలమాహాత్మ్యమే యిట్లు పరిణమించినది. కని పెంచిన వ్యామోహంబు త్రెంపుకొనలేకున్నాను. ఈ సందర్భమె మఖు ప్రాప్తి హేతువు. ఓసీ! పుత్రికారూపమహాఘాతప్రథమావతారమా!

మ. తెగుదాఁకన్ బిగియింపఁబోకు హృదయోద్రేకంబు మైనన్నలం
తిగ వీక్షించి నిరాకరించి గురుబుద్ధిన్ దోసి పోఁజూచు నీ
పొగరుంగూఁతలకున్ ఫలం బొదవు జేపో మాంపో వ్యక్తీకరిం
పఁగ నేలా? తినఁబోవుకూర రుచి? వంశద్రోహసంధాయినీ.

హేమ : తండ్రీ! సకారణసాత్త్వికప్రేమైకవాదమహిమంబున నెవటి వారి యభిప్రాయంబు లొక్కొక్కసారి మార్పవచ్చుఁగాక. పరుషాలాపంబులు నిష్ప్రయోజనములు.

తారా : హేమలతా! నీ పట్టినపట్టు వదలవు. నీ తండ్రిగారి కోపము జూచిన నాకుఁ గాలానుటలేదు. శూరసేనా కాలమృత్యుపరత్త్వ నగు నన్ను కుటుంబాంతఃకలహదుఃఖాగ్ని నేల కూలఁద్రోసెదవు. నా శ్రేయోభిలాషిణివై నీ వీ సంబంధ మామోదింపుము.

హేమ: తల్లీ! నీకుఁగూడ నిదియేటివెఱ్ఱి? దీనం గుటుంబకలహంబు లేల జనింపవలయు? నన్నిట్లేటికి నిర్బంధింతురు? ఱేపు కాఁపురము సేయవలసినదానను నేనేనా? పితృవాక్యోల్లంఘనేష్టవరపరిత్యాగరూపక్రియాద్వయాంతఃపతన నిరంతరాశాంతిభూయిష్ఠ నైన నా స్థితి, నా యవస్థఁ దగులుకొనిన వారికిఁగాని బోధపడదు.

తారా : ఏమో! బిడ్డయిష్టము, తండ్రిచిత్తము. మధ్య నాకెందులకీ గొడవ? ఏది యెట్లు లైన నాకేమి? అడ్డాలనాఁడు బిడ్డలుగాని గడ్డాలనాఁడా!

విక్రమ : దేవీ! ఈ రాలుగాయతో నధికప్రసంగము వలదు. దీనికి బలాత్కారోద్వాహము ధాత వ్రాసియుంచినాఁడు. ఎందులకు వృథా కంఠశోష? ఱేపు నా చెయిదమున కడ్డుపెట్టు దిట్ట యెవ్వఁడో చూచెదఁగాక.

(వడివడి నిష్క్రమించును.)

# చతుర్థాంకము

హేమ : సరే, బలాత్కృతి నా చెట్టఁబట్టి కాఁపుర మొనర్చువాఁ డెవఁడో నేనును బరికించెదఁగాక. (వడివడి నిష్క్రమించును.)

తారా : తుద కిది గృహకల్లోల కారణం బయ్యె. తండ్రి తనపట్టు విడువఁడు. బిడ్డ హృదయస్థితాభిప్రాయము మార్చుకొనదు. ఈ సందిగ్ధావస్థ భయావహము. ఆఁడుదాన నే నేమి చేయనేర్తు? ఎవరి కని చెప్పగలను? అన్నిటికి దైవమే దిక్కు. (నిష్క్రమించును.)

హేమ : (ప్రవేశించి) శ్రీ మత్పరదేవతామతల్లీ! ఆశ్రితజనగణకల్పవల్లీ! నన్ను విషమపరీక్షఁ జేయుచుంటివి. ప్రియప్రథమసమావేశముననే పెల్లుబ్బిన మోహాతిశయం గావించితివి. తెల్లవారఁగనే సంప్రదాయసిద్ధాగ్నిసాక్షిక వివాహసూత్రబంధమున మమ్ము బాధించితివి. ముద్దుమురిపెమైనఁ దీఱక మున్నే, విశ్లేషపరితాపజ్వాలఁ గూలఁ ద్రోసితివి. నేడు జననీజనకులఁ గుమార్గగాములఁ గావించుచున్నావు. అగుఁగాక! మా మోక్షము నీయరచేత నిముడ్చుకొని మమ్మిన్ని యాటలాడించుచున్నావు. మేలు. నీ ప్రయత్నమును వదలకుము. నీ యంతటి దైవతము నిష్టదైవముగాఁ బూజించి చంద్రశేఖర ధర్మపత్ని నైన నేను స్వప్నవ్యాప్తి నేని నధర్మపథంబున నడుగిడను. మా యనురాగము కేవల మైహికసంబంధ మని తలంపకుము. ఆముష్మికవిభూతియే మా యప్రయత్నాన్యోన్య రాగరస పరమావధి. కనుక మా జీవితము లెట్లైనను సంకల్పసిద్ధి సిద్ధము. దేవీపరీక్ష మా యభీష్టఫలావాప్తి కొఱకే నిర్దేశింపఁబడి యుండును. కాళీమహాదేవీకృపాపాత్రురాల నగు నాకు బలవంతంబుగ ద్వితీయోద్వాహ మొనర్పఁ గలవా రుందురా? ఇప్పట్టున జననీజనకుల మనశ్శాంతికి భంగ మాపాదింపక తప్పదు. ఇందు నాకు మాతాపితృశాసన నిరాకరణదోషము రాఁగూడదు. ననుఁగనిన తలిదండ్రుల కనులయెదుట నీ భౌతికశరీరము చాలింప వలసివచ్చినను సద్యశ్చంద్రికాదివ్యసింహాసనాధిష్ఠిత నై సెలవు గైకొనియెద. స్వశీల సంరక్షణావసరంబుల స్త్రీ లెట్టి తెగువ వహించినను బూజనీయలు. సదానందస్వామి దర్గృహంబున కిప్పుడ పోయి కర్తవ్య మాలోచించుకొనియెద. (వడివడి నిష్క్రమించును)

## ద్వితీయరంగము

### సదానందదరీగృహాంతర్భాగము.

[సదానంద గోపాలశర్మలు ప్రవేశించుచున్నారు]

గోపా: స్వామీ! నేను నిశ్చయముగ మనవి చేయుచున్నాను. ఎల్లి ప్రభాతంబు ననే ముహూర్తము. తమకు నివేదించుటకే నేఁ డేతెంచితిని.

సదా: ఏమో? నా కెంతమాత్రము నమ్మకము లేకున్నది. ఆపిల్ల యిదివఱకే మఱో కరిని ప్రేమించుచున్నదని వింటిని.

గోపా: తమ రెట్లు పొరపాటున వినియుంటిరో గాని, యామె తలిదండ్రులు విన్ననేకాదా? సంబంధము నిశ్చయపఱచుకొనిరి. పసుపు కుంకుమ పెట్టుకొనుటయు జరిగినది.

సదా: వధువు మనసు గ్రహియించితివా?

గోపా: నే నిందనుక నామె యభిప్రాయ మెఱుంగను.

సదా: ఓహో! అలాగుననా?

గోపా: అట్లనియెడ రేమి? ఆమె తలిదండ్రులాజ్ఞ జవదాఁటి పోఁగలదా?

సదా: వలపువిషయమున జననీజనకవాక్యనిరాకరణ మనిన నా కాశ్చర్యము లేదు.

గోపా: ఏది యెట్లున్నను హైందవాంగన లస్వతంత్రలు గదా?

సదా: నేఁ గాదనను గాని వారి యంతరాత్మలు స్వాతంత్ర్యప్రియములు.

గోపా: తాతయ్యా! నన్ను నిరుత్సాహపఱచవలదు. హేమలత నోరుదెఱచి మనసు విప్పి చెప్పకున్నను హావభావవిలాసాదుల మనోనిశ్చయము గనుఁగొనఁ గల్గితిని.

తే. గీ. విలసితప్రణయాపాంగవీక్షణములు
సానుకూలైక మందస్మితాంకురములు
చిత్తవిభ్రమ వ్రీడాభి చేష్టితములు
తత్సతీమనోమోదప్రదర్శకములు.

సదా: (నవ్వుచు) స్త్రీ నైసర్గిక విలాసాదులు మోహితు లాత్మైక్యానుసంధాన మొనర్చుకొనుట లోకప్రసిద్ధము. ఇంత రాద్ధాంతసిద్ధాంతము లెందులకు?

వివాహమే నిశ్చయమైన హేమలతయుఁ దద్విషయమై పీఠాధిపతినైన నా ముందు సమ్మతింప వలయుఁగదా? ఎల్లియే ముహూర్త మనుచున్నావు. ఇప్పుడో? కొంతసేపటికో? హేమలత యిందు రాకమానదు.

హేమ : (వడివడిఁ బ్రవేశించుచు) సమయమునకీ దౌర్భాగ్యదామోదరుఁడుగూడ నిందే యున్నాఁడు. నాతోఁ బ్రసంగించెనేని వీని డెందము డిందుపడు నట్లు ప్రత్యుత్తరించెదను. (ప్రకాశముగా) స్వామీ! ప్రణమిల్లుచున్నాను.

పదా : దీర్ఘాయుష్మతీ భవ! నీవు చూడనట్లున్నది. కాఁగల నీ భర్తగూడ నిచ్చటనే యున్నాఁడు.

హేమ : స్వామీ! యెఱుంగని యర్థ మే మున్నది?

గోపా : ఆచార్యా! విస్పష్టమైనదియా? నే నెంత నాకొనినను నమ్మరైతిరి.

హేమ : రాకుమారా! స్పష్టమైన దేమిటి?

గోపా : ఎల్లి మన యుద్వాహము నిశ్చయ మగుట.

హేమ : జరిగినప్పుడు గదా నిశ్చయ మనుకొనుట?

గోపా : అట్లనియెద వేమి?

హేమ : మఱి యెట్లనవలయు?

తే. గీ. పుట్టి పెరిగితి నీ ముక్కుమొగ మెఱుంగ
నింతవాఁడ వే నెవతెనో యెఱుఁగ వీవు
మన పరస్పర ప్రణయసంబంధ బాంధ
వంబు లీ పాటి; వేటి నైనాహికేచ్ఛ.

గోపా : ప్రియా ! న న్నిట్లీసడింపకుము. భవద్దినదినప్రవర్ధమానవయోలావణ్య ప్రాభవాతిశయములు ధ్యానింపని రోజు, త్వదనురాగభాగ్యవరోపలబ్ధి కారణేష్టదైవతప్రార్థన లొనరృని పూఁట, యుష్మచ్చేతఃప్రీతికరకార్యాను సంధానపరత్వంబున వర్తింపని క్షణము, నా జీవితమందు మృగ్యము. ఇంకను నిరసింతువా?

హేమ : అహా! ముమ్మాటికి న న్నట్టుకొనుట మెడ కురిఁబెట్టుకొనుట. అంత్యనిష్ఠురముకంటె నాదినిష్ఠురమే శతవిధముల మంచిది. ఖండితముగ వాకొనెద, విను.

మ. అనురాగం బిసుమంత నీ యెడల శూన్యంబైన సాధ్వీలలా
 మను జేపట్టి ప్రయోజనంబుఁ గన వేమాత్రంబు, సంతాపభా
 రనితాంతైకనిధానమై, శయనసర్పంబై, మనశ్శల్యమై
 ఘనరాజాన్వయకాననానలసమాఖ్యాస్ఫూర్తి సాధింపదే.

గోపా: కట్టా? త్వద్వచశ్శాతహేతిపాతవిగతచేతస్స్థైర్యుండ నైతి. మృదుల హృదయా! నిన్నే విధమున నైన, నే యసమయమున నైన, నతిక్రాంతమర్యాదుఁడ నైగాని, ధూర్తస్వభావుఁడనై గాని, యెల్లిద మొనర్చియుంటినేని, క్షమింపుము. కర్ణకఠోరము లగు నీ వాక్యంబులు శాంతస్వభావంబున నుపసంహరించుకొని మన్మనోవేదన మాన్పుము. యుక్తాయుక్త పరిజ్ఞానవు. పరిస్థితులామూలము పరిశీలింపుము.

సీ. మనకీడు జోడని జననీజనకు లేర్ప
 ఱింపఁగ నంగీకరింపఁ దగదె
యౌవనవిభవశీలాదుల హీనుండ
 నంచును నీవైన ననఁగలేవు
ఏనాఁటి నుండియో యిచ్చిపుచ్చుకొనెడి
 కలసిన చుట్టఱికంబు మనకు
స్వప్నసమాగమసమయమందేని న
 న్యాయత్తచిత్తుండ నైనఁగాను
నేను మానిన ననురూపుఁడైన వరుఁడు
వేఱొకం డెందు నీకు లభింపఁగలఁడు?
వెఱ్ఱిరాద్ధాంత సిద్ధాంత విధుల ననుస
రించి రాసుతుని నిరాకరింప కబల!

హేమ: మోహాంధకారోన్మత్తుఁడా! నీవు దప్పిన నా కనురూపుం డగు భర్త దుర్లభుఁడా? ప్రపంచము గొడ్డువోయినదియా? నీవు సాక్షాన్మన్మథుఁడవే యనుకొనుము. నా కంటి కింపు ఘటింపవలదా? రూపయౌవనవిభవ వక్తృత్వాదుల విలుచుకొనఁ దగినదియా, వలపు? ఈ గంతకుఁ దగిన బొంత దొరకక మానదు. లభింపదా? ఆజన్మాంతబ్రహ్మచర్యవ్రతమే శరణ్యము.

నిశ్చింత నీ దారిని నీవు నడువుము. నన్ను యథేచ్ఛం జననిమ్ము. జననీ జనకులు నేఁడు బలవంతముగ ముడిపెట్టువారే గాని, రేపు నీ సంసారము దుఃఖ సాగర మైననాఁ డుద్ధరించువారుగారు. కనుక నేఁడు నిరర్థకంబులై తోఁచు నా హితోక్తులు ముందు ముందు సార్థకంబులు గాఁగలవు. విశ్వసింపుము.

మ. జనకా! యంచును మోడ్పుఁగేలున నమస్కారంబు గావించి స
జ్జనసంభావిత పూతవర్తన విశేషవ్యాప్తిమై సోదరా!
యని మన్నించెద నంతెగాని, గురుపుష్పాస్త్రప్రహారార్తనై
చని వ్యర్థంబుగ నిన్నుఁ దుచ్ఛవిషయాసక్తి న్విలోకింతునే?

సౌభ్రాతృత్వమునఁ బ్రపంచము నంతను వీక్షించు నేను నిన్నే వగింపను. నిష్కళంక మైన నా ప్రేమము నీ యెడఁ గూడ బ్రసరించుచున్నది. తత్ప్రియరసము సౌదర్యదృష్టిఁ బ్రసరించెడిని. ఇందనుక నన్ను నీ వే భావంబున వీక్షించు చున్నను నీక మీఁద మాత్రము తోఁబుట్టువుగా మన్నింపుము.

గోపా: (చెవులు మూసికొని) వినఁజాల! వినఁజాల. నిన్నే మని యేమి ప్రయోజనము? నా దురదృష్ట రేఖను నిందించుకొనియెదను. పోనిమ్ము.

మ. నిను నాసించుట నీ మతానుసరణిఁ నిందాస్పదంబైన నా
దిన మాయుఃపరిపూర్తి వీనికి, పునర్దేహాంతరప్రాప్తి నం
దిననాఁడేనిఁ బరిగ్రహించెదఁ దపోనిష్ఠాఫలస్ఫూర్తినై
నను, పాలింపఁడె శ్రీశుఁ డీమొఱఁ బ్రసన్నస్వాంతసంశీలుఁడై.

హేమ: మహాశయా! నీ కట్టి దురాశయు వలదు. జన్మజన్మాంతరములనైన మనకు దాంపత్యానుభవము కల్ల. నేఁడు సోదరసోదరీభావంబున వర్తించిన యాత్మ సంబంధము భౌతికశరీరము మాయమైననాఁడు మాఱునా? ఆత్మ పరమాత్మయం దైక్య మగునంతవఱకు సంచిత మనుసరించి పుట్టుచు గిట్టుచుఁ దోడియాత్మలతోఁ బూర్వజన్మబాంధవంబుననే నియమితకాలము ప్రవర్తించును గాన, నీవు వేయేండ్లు తలక్రిందుగాఁ దప మాచరించినను, దదర్థమున కనర్థము గల్పింపనేరవు. నీ వేమి ప్రపంచమంబున బ్రకృతికిం గారణంబైన వైష్ణవమాయయుఁ బ్రకృతివిరుద్ధంబుగఁ బ్రవర్తింపనేర దని తెలిసికొనుము. కావున యీ పయి నీ తపము నిష్ఫలము. ఎందుల కింత గొడవ?

## ప్రణయాదర్శము

సీ. నీ కంటి కింపయి నీ ప్రాపు నాసించు
తరుణీలలామంబు కలవుగాదు
రాజాధిరాజకరగ్రహణార్హనే?
తత్పౌరజనునకుఁ దగుదు గాక
మన్మానసాధీశమంగళవిగ్రహా
రాధనమ్మె నితరం బెఱుంగ
తత్ప్రణయ రసావతారమూర్తి విలీన
నై నే నిపుడు పరాధీన నైతి
కడకు నీ మాట కేమి నాకపతి కైన
నను దురుద్దేశమునఁ గన్న మనఁగరాదు
ఇహపరంబులకు వెలి యయ్యెదవు గాన
సోదరా! వలదు వల దీ యుద్యమంబు.

ప్రభూత్తమా! రాజపౌరసంబంధమున భవదధీనంబైన నా శరీరము నేమి యొనర్చుటకైన సమర్థుఁడవు. కాని నా పై నాగ్రహింపకుము. నీ ప్రభుత్వము నందు సామాన్యకాంతలందును సాధ్వీధర్మ మిట్లు వెల్లివిరిసినందులకు నీవు గర్వింపుము. సోదరా యని నిన్ను మన్నించు నన్ను సౌదర్యసాదర భావంబునఁ దిలకించి నీ తోఁబుట్టు నిట్టి దృఢచిత్త గదా యని సంతసింపుము. పాపభూయిష్ఠంబును, వంశవిధ్వంసన కారణంబును, శాశ్వతదుర్యశః ప్రదంబును, ఇహపర దూరీకరణ హేతుకంబును, కులక్రమాగత మర్యాదాతిక్రమంబును నగు పరకాంతాపరత్వదుష్కార్యారంభుఁడవు గావల దని భవచ్చరణాలింగన మొనర్చి బతిమాలెదను. విషయసుఖేచ్ఛావిముఖుండవై, సోదరీ! యని సంబోధించి నా కంఠ మర్పింపు మనినను సిద్ధముగ నున్నాను. నీకు దైవ మనుకూలుం డగుఁగాక. నిన్నీ దుష్పథంబునుండి తొలగించుఁ గాక. పాపము శమించుఁ గాక. అన్నా! ఇఁక మాటాడకు.

(ఆజ్ఞారూపకమైన కరాంగుళిసంజ్ఞచే వెడలించును.)

గోపా: (తన దురదృష్టరేఖ నిందించుకొనుచుఁ గొంతదవ్వు నడచి) నే నింత మాత్రమున నిరాశాహతిఁ గూలరాదు.

తే. గీ. చెప్పెడిది యొకటి మఱి చేసెడిదివేఱు
నైజగుణమండ్రు కాంతాజనంబులందు
వలదు వల దనుమాటకు వలతు ననుట
వక్రరీతి నర్థంబు గావలయు నిపుడు.

కనుక మానవప్రయత్నలోపము రానీయను. యాచకుఁడేమి కాముకుం డేమి విసువును సిగ్గును మొదలంటఁ జంపుకొనవలయు.

(నిష్క్రమించుచున్నాఁడు)

సదా: (ఆత్మగతము) ఓహో! ఈపె హేమలతయా? హైమవతియా?

శా. స్త్రీలోకాద్భుతశేముషీ విమలపాతివ్రత్య మీ ప్రాయమం
దీ లోలాక్షికి సంతరించిన ధరాహేలాకలాలోలమా
కాళీదేవికృపావిశేషము జగత్కల్యాణ సంధానస
చ్ఛీలాకారుల నీ వధూవరుల గాసిం బాపి పోషింపదే?

(ప్రకాశముగా) బిడ్డా! భవన్నైసర్గికశీలసాహసధార్మికప్రసంగము చంద్రశేఖరుఁడు విని యుండిన నెంత గర్వించియుండునో?

హేమ: మహానుభావా! ఆయన నా ప్రసంగము విని మెచ్చు నావకాశ మొదవకున్న మానె. ఈ యభాగ్యదేవత, నిజమనోహర శ్రీపాదతీర్థ సేవాప్రాప్తి కంత్యకాలమున నైన నర్హురాలగునా?

సదా: బిడ్డా! నిస్పృహం జెందకుము. అధైర్యపడి ప్రయోజన మేమి? నీ కింత వంతకుం దగిన కారణ మేమున్నది?

హేమ: స్వామీ! ఇంకను నట్లు సెలవిత్తురేమి? నా యంగీకారానంగీకారము లతోఁ బనిలేకుండ బలవంతముగ నెల్లి గోపాలవర్మకు ముడివెట్టం దలంచు తండ్రి వారినుండి బైటఁబడి పాతివ్రత్యము గాపాడుకొనుటకు నా మెడ కురిఁ బెట్టుకొనుట తప్ప గత్యంతర మేమున్నది?

సదా: కట్టా! దైవము మీ కింత ప్రతికూలుఁ డగునని నేఁ గలనైనఁ దలంపనైతిని.

హేమ: తండ్రీ! చింతింపకుము. అభిమానధన మున్నది. వజ్రంపుటుంగరమున్నది. బలవంతముగఁ జచ్చెదను. భర్తకుఁ బేరుఁదెచ్చెదను. రేపు హేమలత మృతకళేబరమునకు గోపాలవర్మ తాళిబొట్టుఁ గట్టుఁగాక. మన్మనోభవు

నితో నొకరేయి గాఁపురము జేసినను యుగము సంసార మొనర్చినట్లు సర తుష్టిఁబొందెదను. కేవలము విషయసుఖేచ్ఛచే నేఁ బరితపించుట లేదు. నా యవసాన సమయంబున నొకసారి చంద్రశేఖరుని పాదాలింగన మొనర్చిన మోక్షము కరతలామలక మయ్యెడిది. నాకుగా నా నాథునితో హేమలత భాగ్యప్రమాదంబులు సైరింపుమని సెలవిండు. ఇఁక నాకు సెలవీయ వలయు. (పోఁబోవ)

సదా : బిడ్డా! గోపాలవర్మ రాజ్యవైభవ వయోరూప సుగుణ సంపదల సాటి లేని మేటి.

హేమ : అగుఁగాక.

సదా : తృణీకరింపఁ దగినవాఁడు గాఁడు.

హేమ : అనఁగా?

సదా : నీవు మనసు సరిపెట్టుకొనఁజాలవా?

హేమ : పరదేవత నీ జిహ్వయందును వక్రాకృతినే వహించినదియా?

సదా : రహస్య వైవాహికములు లెక్కింప నక్కఱలేదు.

హేమ : నీవు కపట సదానందుఁడవు.

సదా : నీ శ్రేయోభిలాషిని సుమా?

హేమ : సాధ్వీపరీక్షా సంకల్ప మపాయకరము. ఎన్నిసారులు మదభిప్రాయము వినవలతువు.

సీ. శీలవిక్రయసాహసికవృత్తి విటకాండ్ర
తలలు మార్చుటకు రోవెలదిఁ గాను
అగ్నిహోత్రుని నేని సఖుచేత బంధింతు
హరిహరులైన న న్నదరియలేరు
శాపచాపప్రయోగోపలబ్ధిని నాకు
వైరిదురుద్యోగభయము లేదు
పరదేవతాదివ్యచరణసంసేవయే
సంతాపసంహారసాధనంబు
న్యాయ్య నైతిక దైవతాధ్యాత్మబలము
లొక్క యాకృతిం గ్రాలి చేయూఁత నొసఁగ

## చతుర్థాంకము

సత్పథంబున నిల్చు నిష్కామబుద్ధి
మూఁడ నున్న మేల్కొల్పఁ గూడదుఁగాక.

సదా : సాధ్వీశిరోమాణిక్యమా!

ఉ. హైందవభూమి యూర్జితమహామహిమాన్విత యౌట నీ యుగం
బందునఁగూడ నిన్నుఁ గనుసంతటి నోములు నోఁచె; నీకుఁ బో
ల్పందగు సాధ్వులే యరిది; పాదరజంబు భరించు మమ్ముఁబోం
ట్లెందఱనో, యొకింగిలి సహించనసతీత్వమహత్త్వ తత్త్వముల్.

దేవీ! నిన్నుఁ బరీక్షింపఁదలంచిన నా మందబుద్ధి మన్నింపుము. భవత్పవిత్ర పాదార
వింద సంసేవాభాగ్యంబున జన్మజన్మాంతరాఘదూరుండ నయ్యెదను.
తల్లీ! అనుగ్రహింపుము. (సాష్టాంగ దండప్రణామము.)

హేమ : (తొలఁగి) అఁ - అఁ - స్వామీ! ఏమి యకృత్యము. చిఱుతల చిలుక
పలుకులు ముద్దు సేయవలసినదేగాని పరిపక్వహృదయులైన తామే సంతుష్టిత
చిత్తులై గొప్ప సేయు టొప్పునా! వయోవృద్ధు లగు తమ నమోవాకంబు
నా యాయుఃక్షైణ్య కారణము.

సదా : వెఱ్ఱితల్లీ! నీకు మృత్యుభయ మున్నదా? మృతజీవనివి. చిరాయుర్దాయవు.

హేమ : స్వామీ! భవదాశీఃపరిభావ మెంతకు నైనఁజాలును. నాకుఁ దప్పనైనది.
సెలవిండు. గత్యంతరము లేనపుడు మరణమే శరణ్యము.

సదా : తల్లీ! నేను జీవించియుండ నీ స్వల్ప కార్యార్థమై నీవు విచారింపవలయునా?
నే నొక యుపాయాంతరము వచించెదను. నీవు సంశయింపక యట్లొ
నర్పుము.

హేమ : అయ్యో! తమ యెడఁ గూడ సందియమా!

సదా : (లోనికిం బోయి తిరిగివచ్చి) హేమలతా! ఇది సమ్మోహనచూర్ణ మనఁబడు
నౌషధము. దీని సేవించిన పిదప రెండుదినముల దనుక మూర్ఛావస్థ సంభ
వించును. శరీర మెల్ల వెల్లనగు. నాడులు స్తంభించును. మరణచిహ్నము లేర్ప
డును. ఏ భిషగ్మణియుఁ గనిపెట్టఁజాలఁడు. శైవమతస్థురాలవు గనుక
మీ కులమర్యాద ననుసరించి మృతకళేబరమునకు దహనసంస్కారము
లేదు. సమాధి యైనను బందుగు లెల్లరు వచ్చుదాఁక స్థాపింపరు. కనుక నీ

నీ చూర్ణ మారగింపుము. ఈ లోనఁ జంద్రశేఖరునకు వర్తమాన మంపి రప్పించెదను. ఎల్లుండి రాత్రి కాతఁ డరుదేరి మూర్ఛఁదేరు నిన్నొరుల కంటఁబడకుండఁ దీసికొని దేశాంతర్గతుం డగుఁగాక.

హేమ : (ప్రణమిల్లి) స్వామీ! తమ తపోమహిమ మసామాన్యము. చూర్ణముఁ బ్రసాదింపుఁడు. (కైకొని) మన్మనోధవున కనుపు లేఖ నాకుగాఁ దమరే వ్రాసియిచ్చును. ఇలు వెడలి తడవైనది. (పోఁబోవ)

సదా : హేమలతా! గోపాలవర్మకును నీకును జరిగిన సంభాషణము నీ తలిదండ్రులు వినియుందురు. అట్లయిన నీ రేయి యెన్నొంటిగ నిద్రింప నీయరు. నీవు వెళ్ళినతోడనే జననిజనకులతో గోపాలవర్మను గ్రహించుచున్నట్లు నటించి యీ మందు సేవించి పరుండుము. నే నిప్పుడే నా తమ్ముని నీ భర్తకడకుఁ బుత్తెంచెదను.

హేమ : చిత్తము.

(ఇరువురు నిష్క్రమింతురు)

## తృతీయరంగము

### విక్రమవర్మ గృహము

[విక్రమవర్మ, తారాబాయి, గోపాలవర్మ ప్రవేశింతురు.]

గోపా : ఆర్యా! నా మనసు కడు నొచ్చినది.

చ. చుఱచుఱఁ జూచి సత్కఠినసూక్తుల నొంచి నిరాకరించి సో
దరుఁడవు పాపముల్ పలుక ధర్మము గాదని మందలించె; కా
పురములు సాగ విట్టి పొలుపుం గని నెడ్డెము తెడ్డెమైన వధూ
వరులకు దుఃఖసంసరణభారమె దివ్యసుఖోపభోగముల్.

ఇంతకు దైవము నాకుఁ బ్రతికూలుఁడు.

విక్ర : నీ వట్లుండుము. పిల్లయందు సర్వాధికారములు గల తండ్రిని నేను నీ కనుకూలుఁడనై యుండ దైవప్రాతికూల్య మేమి చేయఁగలదు? ఎట్లీ కార్యము సానుకూలపడదో చూచెదను.

గోపా : పెద్దలకేను విన్నవింపఁగలవాఁడఁ గాను కాని — దాంపత్యానుబంధము

జన్మాంతరగతమైనది. వధూవరాన్యోన్యానుకూల్యము లేనిది సంసారము గడియ గడువదు. పరస్పరానురాగ స్త్రీపురుషసంబంధము స్వర్గ్యానంద తుల్యము. ప్రతికూల భార్యాభర్తృసంయోగము ఘోరనరకదుఃఖభాజనము.

విక్రి: అఁ - ఇవి నవనాగరిక ప్రోక్తంబులు. సూత్రధారణమైన పిమ్మట భర్త యడుగులకు మడుగు లొత్తుచుఁ బడి యుండక స్త్రీ చేయఁగల దేమి?

గోపా: దేవా! ఏమేనిఁ జేయనోపు. స్త్రీ సాహస మసామాన్యము. ప్రక్క బాఁకై, పడకపామై, కంటినలుసై నాథుని వేధించి సాధించును. నేఁడు బలవంతముగ ముడిపెట్టఁగలరు. కాని రేపు నే నేటికిం దీయఁ దాఁ గోటికిం దీసి, నేఁ గద్దనినఁ దా వద్దని, చీటికి మాటికి నా చేతికిఁ జేతకుఁ జేతమునకు నంతరాయమై, నన్ను, నా జీవితమును, నా సంసారమును, నా సర్వస్వమును, నాశనమొనర్చి యాపె నాశన మగునాఁడు మీ రడ్డుపడఁగలరా? కడకు పిడివడి పుట్టిన మెట్టినిండ్ల కపఖ్యాతి నంటగట్టునపుడు మీరు మాన్ప నేర్తురా?

విక్రి: నాయనా! నేఁడు హేమలత బాల్యచాపల్యంబున నకటావికటంబు లాడిన నాఁడుఁగాక! నిన్నుఁ జెట్టఁబట్టి మెట్టినింట నడుగుపెట్టి రాణివాసంబున రాజ్ఞి ననిపించుకొనుచు సామ్రాజ్యభోగభాగ్యానుభవంబుల నోలాడునాఁడు నీ దాసానుదాసురాలై కాఁపురము సరిపెట్టుకొనదా?

గోపా: వట్టిమాట.

చ. పురుషుఁడు వైదుషీగుణవిభూతి యశోన్వితుఁడైన మాత్రె సం
బరమున స్త్రీలు వైఁబడరు; భ్రష్టనికృష్టచరిత్రునేని సా
దరమునఁ జూతు; రింతకుఁ బ్రధానము రాగము; తాదృశానురా
గరససముద్భవం బది యకారణజన్య మతర్క్య మారయన్.

వలపు - భోగభాగ్యంబులఁగాని, సంగీతసాహిత్యంబులఁగాని కులీనతాశాలీనత్వంబులఁగాని, సౌందర్యౌదార్యంబులఁగాని - విలుచుకొనఁదగినది కాదు.

విక్ర: ఈ సిద్ధాంతము నే నామోదింపను. మగవాని చతురవచఃప్రచారములకు, తరుణవయఃప్రాభవములకు, సామ్రాజ్యాధికారవైభవాతిశయములకు లోను గాని స్త్రీనిఁ గానము.

తారా: (ఆత్మగతము) ఇది కేవలము పొరపాటు.

విక్ర : గోపాలవర్మా! నామాట వినుము. నీవతిచతురమతివి. యౌవనపరిపూర్ణుఁడవు. అభినవధనదుఁడవు. ఒక్క బాలికను స్వాధీనపఱచుకొనఁజాలవా? నీ శక్తి సామర్థ్యంబులు నీవు గుర్తింపకున్నావు.

గోపా : ఏమో, మామా! సాహసింపలేకున్నాను. (ఆత్మగతము) ఆశాపాశ మెంత దృఢతరమైనది!

తే. బాలికా తిరస్కృత్యాతప ప్రాప్తి మోడు
వాఱినట్టి మదాశయ భూరుహంబు
విక్రమప్రభుప్రోత్సాహ సిక్తమధుప
బాలిక గమస్మితోత్స్వర్ణఁ బల్లవించె.

ఛీ! మనసా! ఎంతటి సిగ్గుమాలినదానవు. ముందుగత యోజింపకొనక మెత్తబడఁజూచుచున్నావు. హేమలతా! నీ పరిసక్తిఁ దలపెట్టను.

(హేమలత ప్రవేశించును)

గోపా : వహ్వా! ఏమి చక్కదనము! నాదురదృష్టము! విధివ్రాత!

హేమ. (తనలో) ఈ నిర్భాగ్యదామోదరుఁ డిందే యున్నాఁడా! (ప్రకాశము) తండ్రీ! (విక్రమవర్మ మాఱుమొగం బగును) నన్నంత యేవగించిన బ్రతుకఁగలనా?

మ. మదభిప్రాయము మార్చుకొంటి, క్షమియింపన్ జెల్లున్ వర్తింతు మీ
హృదయాభీష్టపథంబునన్; నిజసుతాశ్రేయస్సముద్ధారకుల్
గద మాతాపితల్; లార్యధర్మగుణవిజ్ఞానప్రబోధప్రశాం
తిదులౌ మీకు నమస్కరింతు గతదుర్ధీసాహసాహంకృతిన్.

(పాదాక్రాంత యగును)

(తలిదండ్రులు దరిఁ జేర్చుకొందురు)

గోపా : (ఆత్మగతము) దీని యర్థ మేమి?

విక్ర : మద్వంశ విభూషణమా? సర్వధర్మశాస్త్ర రహస్యార్థవేదినివి. నిన్నొకరు దిద్దునది యే మున్నది? తల్లీ! కని కనులలోఁ బెట్టుకొని పెంచి పెద్దదానిం జేసి మేము నీమేలు గోరకుందుమా? ఱేపే శుభముహూర్తము. నా కనుల యెదుటఁ గలకలలాడుచు బెళగువ్వలజతలాగు మీ జంపతులు దిరుగులాడఁ

[illegible]చుభాగ్య మొదవించితివి. గోపాలవర్మా! నే నెంత వచించినను విన వైతివి. చూచితివా?

గోపా: ఆశ్చర్య మగుచున్నది. (ఆత్మగతము) క్షణములో నెంతమార్పు! స్త్రీల గాథ లగాధములు.

విక్ర: తల్లీ! ఇప్పటికే ప్రొద్దయినది. పైన నోగిర మారగించి శయనింపుము.

తారా: అమ్మా! ఈ రాత్రి వివాహప్రయత్నముల సందడిలో నీకు నిద్రపట్టదు. వేకువజామున మంగళాభ్యంగస్నానమునకు దిగి మేల్కొనవలయు. నిద్ర కాఁగలదానవు గావు. సౌధోపరిభాగంబున శీతలవాతపోతంబులు నిన్ను జోకొట్టుఁగాక. అట ప్రశాంతంబుగ నుండును. అందు విశ్రమింపుము.

హేమ: చిత్తము (రెండడుగులు నడచి ఆత్మగతము) వెఱ్ఱివాండ్రు! వీరు నన్ను విశ్వసించుచున్నారు. స్త్రీలు పురుషు లనుకొనునంత సులభసాధ్యలు గారు. వారి హృదయంబు లభేద్యంబులు, అతికోమలములు, కడు సునిశితములు, దృఢతరములు, స్వాతంత్ర్యప్రియములు. పుట్టుకచే నబల నైనను నేను సబలను. నాకు మేధాబల మున్నది. ఆత్మబల మున్నది. త్యాగబలమున్నది. ఖడ్గవిద్యాబల మున్నది. నన్నెత్తిచూడఁగలవాఁ డెవఁడు? చంద్రశేఖరునకు దత్తమైన మత్తనువల్లిక వీతిహోత్రుండైన నంటనేర్చుట కల్ల. మానినీమణుల స్వాభిమాననిధానము లెక్కాలమందైన సురక్షితములే. బలాత్కృత పునర్వివాహంబున నన్నొకని కంటఁ గట్టి నా యాలువుఁ జెఱుప మూర్తిత్రయంబునకును దుస్సాధంబు. ప్రకృతిరంగమందు స్త్రీ ప్రధానపాత్ర. స్త్రీల కెగ్గు రోయువారికి గతులు లేవు. మానవతికంటితడి విప్లవసూచకము. సాధ్వీతీక్ష్ణదృష్టిప్రసారంబున రారాజులు తరాజులైరి. సామ్రాజ్యంబులు పూజ్యంబులైనవి. ప్రపంచంబులు పటాపంచలైనవి. తదీయప్రభావంబు లప్రతిహతములు, అప్రతిమానములు, అనిర్వచనీయములు. ఒకతె బాల దండధరుని బ్రతిఘటించినది. ఒకతె కర్మసాక్షి నరికట్టినది. ఒకతె సృష్టిస్థితిలయకారకులఁ బసిపాపల గావించి వినోదించినది. పాతివ్రత్యమే సత్యము, సత్యమే దైవము, దైవమే నిత్యము. నేను పవిత్రచరిత్రను. నాకు వీరి వెఱ పేల? వీరిఁ దప్పుకొన వెఱవరయ నేటికి? చంద్రశేఖరుఁడే విశ్వ మంతటనునిండి నన్ను రక్షించుకొనుచున్నాఁడు. నేను ప్రాణపణంబుగా స్వాభిమానధనము గాపాడుకొనఁగలను. ఇం కేమి కావలయును? (నిష్క్రమించును.)

# ప్రణయాదర్శము

విక్ర: గోపాలవర్మా! ఇంక సందేహింపకుము. ఎల్లి సుముహూర్తము దప్పదు. నీ ప్రయత్నంబున నీ వుండుము.

గోపా: మహాశయా! క్షణక్షణపరివర్తితహేమలతాంతఃకరణాస్థిరత్వము సందేహాస్పదము.

విక్ర: నీవట్లూహింపఁజనదు. హేమలత విజ్ఞానప్రసూన, వివాహప్రయత్న మొనర్పుము. నీ విఁకఁ దడయవలదు.

గోపా: చిత్తము. (నిష్క్రమించును)

విక్ర: తారా! ఈపటితో మన తలభారము దొలఁగనున్నది. ఈ శుభవర్తమానము వెంటనే బంధుకోటికిఁ దెల్పవలయును. సర్వప్రయత్నము లిదివఱకే నిర్వహింపఁబడినవి. వధువునకు వలయు వస్త్రవాహనాద్యాభరణములు సేకరింపుము. వ్యవధి లేకుండఁ గార్యభారము వహించితిమి. గుట్టుగా బ్రదికిన వాండ్రము. గౌరవము దక్కవలయు. ఇంకఁ జేయఁబోయి చేయుదుమా? ఒక్కగా నొక్కబిడ్డ. మనముద్దుముచ్చట లన్నియుఁ దీఱవలయు. వ్యయమున కాలోచింపకుము.

తారా: అట్లే యగుంగాక. దేవరయాజ్ఞ కన్యథా జరుగదు.

(నిష్క్రమింతురు.)

# ప్రణయాదర్శము

## పంచమాంకము

### ప్రథమరంగము

[సౌగంధద్వీపమునఁ జంద్రశేఖరుని శయనాగారము]

చంద్ర: (విరహముతో) ఆహా! వేగుజామైనది. రవంతకూర్కునకు నోఁచుకొన నైతిని. మృదులశిరీషపేశలహంసతూలికాతల్పంబుల కెడమై గ్రీష్మాతప తప్త కర్కశ శిలాపర్యంకశాయినై నానానేక నవీన ప్రసూన వితాన సుగంధమంజులారామవిహారరహితుండనై షడ్రసోపేత మృష్టాన్న భోగ విచారదూరుండనై ప్రకృతిదివ్యస్వరూపదర్శనలాలసాకర్షితుండనై కేవల దివాంధమువలె మూలమూలల బ్రహ్మచర్యనిష్ఠాతత్పరత్వంబున మెలఁగు చున్నను ననంగశరపాతము దప్పించుకొనలేనైతి. అంతకంటెను దదంగన దృక్పాతము నుండి బైటఁబడలేకున్నా ననుట సమంజసము కాదా?

సీ. నిర్జిత స్వస్తరుణీసుషమాశేము
పీవిలాసాత్త ప్రసిద్ధి కంటె
కమనీయ కంఠ విగళదప్రయత్నాను
రాగబంధురశబ్దరాజికంటె
పరమమహోత్సవప్రాప్త్యైక హేతుత్రి
పావిచేష్టాపరంపరల కంటె
నీవిబంధవిమోచనావరోధావకా
శ రచనానైపుణ్యగరిమకంటె
ప్రథమసురతకాలీనతాభరవిలీన
చేతనాంగనాకృతసవాక్షియుగరోధ
పాణిపద్మాంగుళీమధ్యభాగలులిత
దృక్కలీముఖపాతంబు తిప్పు నెట్టు.

# ప్ర ణ యా ద ర్శ ము

తద్దృష్టిస్మరణమాత్రి ననిర్వచనీయానందమ్మును సంతతదురంతాక్రాంతసంతాపంబును. మానసగోచరం బయ్యెడి. ప్రియత్నపూర్వకముగ మఱతునని బలవంతంబుగఁ గనుమూసినను, నప్రియత్నసాక్షాత్కృతమైఁ గనుఱెప్పలకును గనీనికలకును మధ్యభాగవర్తినియగు తటిల్లతానుగుణ రూప హేమలతా దివ్యాకారము బారినుండి దప్పించుకొనఁజాల కున్నాను. తొలుతనుండియు మా చరిత్ర మతివిచిత్రము. ప్రప్రథమమున దైవోద్దిష్ట శత్రురాడ్గృహద్వారప్రవేశము. అచట ననన్యసులభాన్యోన్య ప్రణయ భావసమ్మేళనము, తన్నిశీథినీగాంధర్వోద్వాహ నిగూఢసాత్త్విక శృంగార రసస్ఫురితాన్యోన్యసంభాషణము, సదానంద సత్కృపాసంవిధానసముచిత సంబంధము, ఆకస్మికశూరసేన వధవిధానము, ప్రళయనిర్ఘాతపాతప్రాయ శాశ్వత విశ్లేషానుభవము, చూచుచుండ నా కనులముంగిట మెఱపు మెఱసిన తెఱఁగున మెఱసిపోయెను. దివసద్వయము యుగద్వయ మైనప్పుడు నా జీవితాంతము దూరమందు లేదని స్ఫురించుచున్నది. అక్కటా! ఏ విషయము తలంపునకు వచ్చినను దాని కదియే విలయజలధిజ్వాలనమై నన్ను దహించుచున్నది. ఆహా!

సీ. దృష్టిదోషంబు ప్రాప్తించు నేమో యని
కన్నారఁ దమిదీఱఁ గాంచనైతి
వలుఁదగుబ్బలు గిలగిలలాడునో యని
బిగుకవుంగిళ్ళఁ గల్పింపనైతి
మృదులోష్ఠభాగసంపీడనంబో యని
దంతక్షతాదులఁ దలఁపనైతి
కలయికరుచులు వెక్కస మగునో యని
గాఢరహఃక్రీడఁ గలఁచనైతి
ఏకగాత్రంబుతోడ నూఱేండ్లు నిండె
నాదిమధ్యాంతజీవిత మదియె మాకు
బహుళయోజనదూరనివాసహేతు
శాశని సమాన మగు ప్రభునాజ్ఞ కతన.

ఆత్మీయచరణారవింద లాక్షారసరక్త చిహ్న ప్రకాశితాస్మల్లలాట ప్రదేశావలోక
నోద్భూత దరస్మితారుణపల్లవాధరయైన తత్సతిఁ గనుంగొని యేమని నేఁ
బృచ్ఛించి నపుడు ముకురఫలకం బొసంగి తదవకాశంబు గైకొని పరిహా
సితమిషంబున మారుమొగంబై నిజచేటి కానర్హాలాపనివారణార్థంబు మత్కర
నఖరాగ్రలిఖితనూత్న పయోధరమదనాంకక్షతనిగూఢాలోకనవ్యాపారతత్ప
రయైన శీతాంశు బింబాననాసంకల్ప మరకంటఁ గన్పట్టి చెంతఁ జేరి మంత
నంబున రసావిర్భూతి "మన మొకరి నొకరు నవ్వుకొనఁబని లేదుగదా!"
యని నే ననినంతఁ గంపళితసుందరమందహాసశాలీనతాకృత్రిమకోపధరసా
విర్భూతాద్భుతలావణ్యప్రకటితవదనాంభోజయై యత్తఱిఁ దత్తరంబున
శయనాగారం బొత్తిగిలం బోవుచిత్తఱి నాయెద హత్తిన మద్బాహుపంజ
రాంతర్గత శారికయై నిర్జితసర్వసురగరుడోరగాద్యఖిలదైవత విలాసవతీ
శృంగారావతారమకరాంకనవ్యవిజయశ్రీధ్వజమై ప్రకాశించె. కట్టా! ఇది
యంతయు మదికిఁ దెచ్చుకొని ప్రయోజన మేమి? ఛీ! నిర్భాగ్యదామో
దరుండను. నాదుర్గతి కింతని విలపింతును.

ఉ. తప్పుఁడనైతి సూనశరదారుణవహ్నులఁ బూర్వసంచిత
వ్యాప్తి సురాంగనానివహవందితభాస్వదనూనసత్కళా
దీప్తివిలాసశోభిత సతీసహవాససుఖానుభోగసం
ప్రాప్తికిఁ దప్పి శూన్యమతి భంగవిషాదపయోధిఁ దోఁగితిన్.

తలఁచి తలఁచి, కలఁగి, విలపించి, సొలసి, విసిగి, వేసారుటె కాని ప్రయో
జనంబు గలదే? కళారహస్య సిద్ధాంతరసికత్వజ్ఞానహీనముగ్ధ హృద
యులమైనను, పరస్పరచేతఃప్రీతికరవిలాసకృత్యంబుల మాత్ర మన్యు
లకుఁ దీసిపోయి యుండము. చిత్తంబు లోకమైననాఁడు, చిత్తజుండు
భృత్యానుభృత్యుఁడై మెలఁగునపుడు, కామసూత్రాభ్యసన మేల? తదితర
వ్యవహారంబు లెట్లున్నను—

మ. దరహాసాంకురచంద్రికావిరచితోద్యద్వక్త్రలావణ్య మా
తరళాలోలకలావలోకననితాంతస్నిగ్ధనేత్రంబు లా
కరుణావ్యాపృతమార్ధ్వపూతదృఢసంకల్పైకభావంబు మ
ద్విరహప్రోద్భవచిత్తజానలసముద్వేగంబె సంధించెడిన్.

## ప్రణయాదర్శము

పరిణయస్వరూపిణి నాశ్రయించియుఁ దదఖిలాంగములు బాధాజనకములే యగుచున్నవి. దోషరహితమైన వస్తువు విశ్వమం దసంభవము. మన్మనోహారిణియు నీ స్వభావోక్తియుం దిమిడియున్నది. ఇందులకుఁ గచ కౌటిల్యము, ఫాలవక్రత్వము, నేత్రచాంచల్యము, దృక్తైక్ష్ణ్యము, పయోధర కాఠిన్యము సాక్షీభూతములు. ఇట్టి లోపకళంకిత యయ్యు నిజవదన పూర్ణిమామృతకరబింబ వినిస్సృత దీధితి పల్లవలచే నా హృదయాబ్జము ముచ్చుముడిగి పోవుచున్నది. ఏది యెట్లైనను బహుయోజనదూరావాసిని యగు హేమలత నా కెబ్భంగిఁ దోఁపఁగలదు? జీవము లేక పోయినను జీవకళ లీను చిత్రఫలకం బిదియ శరణ్యము.

(చిత్రఫలక లగ్నవీక్షణుఁడై విశ్రమించును.)

విజయవర్మ : (ప్రవేశించి దూరమున)

క. మహిలో భగవల్లీలా
మహిమం బత్యద్భుతంబు మనసిజబాణో
పహతుం డీతని ప్రాణా
పహరము లర్ధాంగి మరణవార్తలు కట్టా.

చంద్ర: ఎవరు వారు? (నిరూపించి) విజయా! ఈయసమయ సమాగతికిం గత మేమి?

విజయ : బావా! పిడుగుఁబోలిన యీ వార్త వినిన క్షణమే బయల్వెడలితిని.

చంద్ర : అప్రియము పలుకుచున్నావు.

విజయ : ప్రియా విషయమే. (కన్నీ గద్దుకొనుచు)

సీ. విక్రమవర్మ పృథ్వీపాల తారాంబి
కా గర్భశుక్తి ముక్తాఫలంబు
జగదేకసంభావ్య సాధ్వీత్వ సర్వక
ళాపూర్ణ లక్షణ లక్షితాంగి
వంశక్రమాగత వైరప్రశమన కృ
త్యోదార పావనోద్యోగచరిత
భవదీయనిర్మలప్రణయసామ్రాజ్య సు
ధర్మాసనావాస ధర్మపత్ని

పితృనియోజితనవవరస్వీకరణ వి
ముఖపతివ్రతారాధసద్బుద్ధికలన
శాశ్వత బ్రహ్మపదభోగసక్త యాగుచు
దృక్పథాతీతసీమ లతిక్రమించె.

చంద్ర : (హా రాద్దుఃఖావేశసూచితావ్యక్తశబ్దోచ్చారణతో మూర్ఛిల్లును.)

విజయ : (శైత్యోపచారములు చేయును.)

చంద్ర : (అపస్మారకావస్థయందే) హా! ల-లి-తా, హేమ-లతా!— నిరాకృత విద్యుల్లతా!

విజయ : అకటా! ఈతని ప్రాణములే లేచిపోవునా యేమి?

చంద్ర : (వచ్చియు రాని స్మృతితో) అఁ - (నిట్టూర్చును)

విజయ . బావా! వృత్తాంత మాసాంతము వినుము.

(ఉత్తరీయముతో విసరుచున్నాడు)

చంద్ర : (అగమోద్పుఁ గిందోయితో) ఊఁ-?

విజయ : గుండెలు వ్రయ్యలుగా—(అర్ధోక్తిలో)

చంద్ర : ఖడ్గసహాయమున నెచ్చెలిఁ గలిసికొను మనియెదవా?

(ఖడ్గము వెదకుచున్నాఁడు)

విజ : (వారించును)

చంద్ర : ఏల వారింతువు. మాలదైవమా! నీ దృష్టికిఁ జేలగింజయు మేరుధరాధరంబై తోఁచినది. హస్తములఁ దలఁబ్రాల పసుపు వర్ణమైనను మాయ లేదు. అప్పుడే గర్భనిర్భేదక ప్రళయ సమయ నిర్ఘాత పాత సదృశ సతీమరణ వృత్తాంతాకర్ణనవిభిన్న స్వాంతదుఃఖపారావారనిమగ్ను నొనర్చితివి. అసార్థక నిర్హేతుకజాయమానకటాక్షబిరుదాంకితా! దయా సత్య శౌచాదులు నీకడ మృగ్యము. నీవు భక్తశిఖామణుల వంచించితివి. నిరపరాధుల దండించితివి. బాంధవకులధ్వంస మొనర్చితివి. స్త్రీ బ్రహ్మ హత్యామహాపాతకంబు లొడిగట్టితివి, నీ కుచ్చనీచములు లేవు, తపాప్పులు లేవు. పేరు ప్రతిష్ఠలు లేవు; నీ వెవ్వండవు? ఎందుండెదవు? ఎందులకు? అవాఙ్మానస గోచరము. అవ్యక్తుండవు, నీ ప్రసక్తి నా కేటికి! హేమలతా!

భవదీయకరగ్రహణానందసంకలితుం డగు చంద్రశేఖరునిపైఁ గల యీర్ష్య చేఁగదా జలవన్మృత్యువు త్వత్ప్రాణగ్రహణాసక్త యయ్యె. ఇంతటి క్షీణాయుర్దాయవు గనుకనే కాఁబోలు సద్గుణపుంజములు నీయందు మూర్తీభవించెను. ఔను! నీయట్టి సద్గుణగణనికురుంబను నా యట్టి నిర్భాగ్యుఁడు దక్కించుకొనఁ గలఁడా! మానవోహాపోహలు విధి వ్రాఁతలకు విరుద్ధములుగ నుండుట కిదియ తార్కాణము. ఈజన్మమునఁగూడ జాయాపతులమై ఋణానుబంధంబుఁ దీర్చుకొనవలసియుండి తదవకాశము రూపుమాసెను. నాకంటె నీ వెంత ముందుగఁ బ్రయాణము సాగించినను బూర్వకర్మపరిపాక సంబంధమువలన సంకల్పమాత్రంబున నిన్గలిసికొనఁ గల్గుదును. ఆత్మైక్య భావ సంవిధానంబున మన భౌతికశరీర విశ్లేషము కృత్రిమప్రాపంచిక నాటకరంగస్థలానుకూలప్రదర్శనము. పూర్వజన్మజ్ఞాన ముత్తరోత్తరజన్మములయందు దైవకృపాసమృద్ధి నాకలవడు నను నమ్మకము గల వాడ నగుటం జేసి ప్రణయస్వర్గసుధర్మాసన మధిష్ఠించిన నీ వీ జన్మమునందు వహించిన రూపమే యస్మత్త్రైకాలికోపాస్యము గాన దానియందే మనస్సమాధి నిల్పి తుదిసారి నీ మృతకళేబరముఁ జూచి తదాకార సంస్మరణతో నీ త్రోవ ననుసరించెదను. విజయా! లెమ్ము.

విజ : (తనలో) ఆహా! పరపక్షప్రతిభాయుతుం డగు నీ మహానుభావుని యనునయింప టనఁగ నెద్ది? ఈతని దృఢాభిప్రాయము మార్చుటకు గత్యంతర మెయ్యది? (ప్రకాశముగా) బావా! నీవే యిట్లత్యంతదుఃఖభారవివశుండవైన నాబోంట్లేమి కావింపఁగలరు?

చంద్ర : వెఱ్ఱివాఁడా! నా కొక రొనర్పవలసిన సహాయ మేమున్నది. నాకు దుఃఖ మేమున్నది. ఏమని చింతించెదను? ఎందులకు వాపోయెదను, చూడు.

సీ. భౌతిక దేహముల్ పంచత్వ మొందినం
తనె యెడబాటెట్లు దంపతులకు?
పుట్టినవస్తువు గిట్టుట, గిట్టిన
వస్తువు బుట్టుట వాస్తవంబు
ఆద్యంతదశల నవ్యక్తమౌ నిష్ఫల
చర్మభస్త్రి కయి విచార మేల?

శిథిలదేహముఁ బాసి జీవుండు నూత్న శ
రీర మాసించుట సృష్టిమహిమ
సగము జీవంబు మునుముందు జనిసనిదప
ప్రాణశేష మిందుంట సంభవము గాదు
నీ యనునయంబు లోదార్పు లెవ్వరికయి?
లేడు వాఁ డిందు లేడు స్వర్గస్థితనుఁడు.

విజ: బావా! ధర్మాధర్మోపదేశము నీ కొసర్ప నే నెంతటి వాఁడను? సమస్త శాస్త్రతత్త్వార్థరహస్యవేత్తవు. నీకుఁ గర్తవ్య మొకరు నిరూపింప వలయునా!

చంద్ర: ఔను.

గీ. నాకు ధర్మోపదేష్ట లనేకపరంబు
మార్గముఁ జూపె మన్ననీయుఁడెయె తొలుత
తత్పథానుగమననిరోధప్రయత్న
భార విభ్రమోత్సాహంబు వలదు నీకు.

విజ: ఇది కేవల మతిసాహసము.

చంద్ర: అమాయకుఁడా! అప్రయత్నానోన్యాను రాగదాంపత్యసహవాససాహసమనుము. ఈజన్మ మెవ్వరికొఱకుఁ గైకొనఁ బడినదియో తత్కర్త్రి మాయమైనప్పుడు నా యునికి మాత్ర మెట్లు సంభవము? మేఘములేని మెఱపు, కారణము లేని కార్యము, నిప్పులేని పొగయు, హేమలత లేని చంద్రశేఖరుఁడు, కల్గుట కల్ల. స్వీయాభిప్రాయవిరుద్ధముగ మఱొకని వరియింపు మనినంత నాత్మహత్యకుం గడఁగిన సతితో సహగమనము పతి కిహపరసాధనము. జన్మాంతరమున నన్నుఁ గలసికొన నెదురుజూచు సతీమణి కీడు జోడగు జన్మాంతర మేను మాత్రము గైకొనవలదా! స్వానుభవైకవేద్యమగు నీరహస్యము నాకుఁ దెలియును గాని యీ యవస్థావిధానము నీ కెట్లు స్ఫురింపఁగలదు?

ఉ. ఆ భువనైకమోహనమహామహిమాన్విత శీల, వైదుషీ
ప్రాభవశేముషీవితతవైభవసన్మతిలక్ష్మి తాంగి, భ

ద్రేభసమానయాన, గతియింపఁగ నీతఁడు తద్వియోగదుం
ఖాభరసంభవానలవిదగ్ధశరీరుఁడు గాకపోవునే.

కనుక నీ వేమియు మాటాడవలదు. నా కవసరమగు ద్రావక మిందు నా స్నేహితుఁ
డైన యాయుర్వేదవైద్యునికడనుండి తెచ్చుకొని యిప్పుడె రాఁగలను.
నే వచ్చు సరి కశ్వముల సిద్ధపఱుపుము. ఈరాత్రి యెంత పొద్దయి
నను విశాలపురీప్రేతావనిఁ జేరవలయు. నీవు నీపనిపై నుండుము.

(నిష్క్రమించుచున్నాఁడు.)

విజ: ఇది నిశ్చయము గానేని కేవలము సాహసము. వైరాగ్యత్రయమం దిది శ్మశాన
వైరాగ్యము గాఁబోలు. ప్రపంచమున నిట్టి మోహైకవిభ్రాంతు లీర్తి
నాత్మహత్యకుం గడంగిన స్పష్టి వైలక్షణ్యము లేదు. ప్రథమమున కమలపై
ననురాగ మొక్కటూరిగ హేమలతపైఁ బ్రవహింపనిచ్చిన కాముకచంచ
లాంతరంగుఁడు, నేఁడు మఱియొక సుందరాంగిని దర్శించిన నీబిజేశు
మఱచి పోఁగలఁడు. మఱియుఁ జావఁదలంచుకొనిన వానికి విశాలపురమే
కావలయునా! తత్సతీప్రాంతశ్మశానమే సిద్ధాంతమా! అట్టి యాదర్శ
నీయదాంపత్యానుకూలభావమే యేర్పడిన నీనాఁటి కీకృత్యము జరిగి
పోవలసియుండెడిది. ఇట్టి సాహసకృత్యములు తలచిన తత్క్షణమే నిర్వ
హింపఁబడవలయుఁ గాక యాలసించిన ననుమానింపవలసినదియే! అయి
నను తనువుఁ జాలింపఁదలఁచుకొనిన వానికి ద్రావకము లేల! హాలాహలము
లేల! అత్యంతనిశితకరవాల కాలాహి ప్రచండ విషజ్వాలలు లేవా! వేఁడి
చల్లాఱిన వెనుక వలదని వేఁడుకొనవలసిన పని లేదు. విశాలపురముఁ జేరక
పూర్వమే మెట్టవేదాంతములు చెట్టుఁ బట్టఁబట్టు. కానిమ్ము, నేను
నాశ్వముల నాయత్తపఱచి సిద్ధముగా నుండెదను.

(నిష్క్రమించుచున్నాఁడు)

చంద్రి: (ప్రవేశించి) ఆహా! అక్కఱకు వచ్చిన మిత్రుఁడే మిత్రుఁడు. ధనాశచే
నైననేమి, నాయదృష్టవశంబుననేమి, అడుగఁగనే ముఖపరిచయ మున్నందు
లకు నీ భిషగ్మణి నాపాలిటి కల్పతరువయి నందులకెంతయు సంతసించెద.
నాప్రయత్నము నిఁక మఱొక రభ్యంతరము పెట్టఁజాలరు. ఖడ్గప్రహారణ
మైనచో స్వహస్తమే జంకవచ్చును. చుఱుకంటి నప్పుడు మానఁబు మన్నో

దౌర్బల్యము పొడకట్ట వచ్చును. అస్త్రశ్రేణి వారింప వచ్చును. ఈ ద్రావక మొకబిందువు రసనాంచలమున సోకినను మృత్యువదనగహ్వరప్రవేశ మమృతాంధసు లైనను దప్పింపనేరరు. నాచెలియే హాలాహల పానప్రసాదమువలన ముక్తిపదం బభిలషించినదియో, తత్ప్రియుండ నైనందులకు నాకును దత్పథమే యనుసరణీయము. ఈ యవకాశంబున నా కెట్టి యభిప్రాయ పరివర్తన మేర్పడునో! ఇక్కడనే నా యుద్యమ మేల నిర్వహింపఁ గూడదు. ఛీ! చంద్రశేఖరునకుఁ గూడ నిట్టి కళంకమా! ఎంతదూరస్థుల మైనను నాత్మైక్యమునకు లోపముండదు. కాని మృతకళేబరములు మాత్రము వేర్వేఱ యేల నశింపవలయు? తత్ప్రణయస్వరూపిణీపార్శ్వగత మగుటయే యీ శరీరమునకు యుక్తము. కనుక నయ్యదియే సముచితస్థానము.

సీ. కరవాలమా! యవసర మయ్యె నేనియు
చలియింపఁబోకు మెందులకునైన,
ద్రావకమా! నీ కృపావిశేషంబుచేఁ
బరియింపవలయు నీతండు నేఁడు,
హేమలతా! యిదె యేను గలిసికొందు
మందగమనముల మసలు మింక,
సౌందర్యమా! పునర్జన్మమందు సతీహి
తాకృతిఁ గైకొను టర్హ మరయ
ప్రాణమా! జీవితేశ్వరీపార్శ్వభాగ
సుఖసమారూఢశయ్యాప్రసుప్తి కలిత
శాశ్వత బ్రహ్మపదవీ ప్రశాంతపట్ట
భద్రతాపరిగ్రహణాభివంద్య వగుము.

(నిష్క్రమించును)

## ద్వితీయరంగము

### గృహాంతర్భాగము

[సదానందుఁడు ఆలోచనాధీనుఁడై ప్రవేశించుచున్నాఁడు]

సదా : అహో (నిట్టూర్పు పుచ్చి)

ఉ. ఇందనుకొ - విచిత్ర మది యెట్టిదియో యరుదేరఁ డా చిదా
నందుఁడు, మూర్ఛఁ దేరు తరుణంబు తదంగన, చంద్రశేఖరుం
డెందుల కాలసించు హృదయేశ్వరిదుస్థితి నాలకించి? మా
యందు మహేశ్వరీకరుణ నాస్తి యటంచుఁ దలంతు నింతకున్.

కలసిరాని సమయములం దుపకారమునకుఁ బోయినను, నపకారమే కల్గుచుండును.

[చిదానందుఁడు వడివడి బ్రవేశించుచున్నాడు]

సదా : తమ్ముఁడా! వచ్చితివా! నా కడుపునఁ బాలోసితివి.

చిదా : సోదరా! పాలు కాదు, విషమే పోయుచున్నాను.

సదా : అయ్యో! అట్లనియెద వేమి? చంద్రశేఖరున కీ వర్తమాన మందలేదా?

చిదా : ఎట్లందును?

సదా : హా! హతాశుఁడనైతి.

చిదా : అన్నయ్యా! భవదాజ్ఞానుసార మేమును జనార్దనస్వామియు తత్క్షణ ముత్త మాశ్వములపై బయలువెడలి నాల్గుయోజనముల దూరమునందున్న శ్రీపుర రాజమార్గమునఁ బోవుచుండ రక్షకభటులు మము నిల్పి మా నివాసస్థలము విని, విశాలపురమున మహామారీజాడ్య మున్నదనియుఁ దత్పురవాసులఁ బరిసర పట్టణములకుఁ బోవునపుడు దినద్వయ మయిన గ్రామబాహ్య నవవిశ్రాంతి భవనములనుండి భిషగ్మణి పరీక్షలఁ గడచి కాని, విశాలాపురీ రాజ్యసంబంధపట్టణములకుఁ బో వీలులేదని మమ్ములను నిర్బంధించిరి. ఇప్పటి కొక గడియముందు మమ్ములను బరీక్షించి విడచిపుచ్చిరి. అందు వలన బహుయోజనముల దూరమునందున్న సౌగంధద్వీపమునకు నియమిత కాలమునకుఁ బోవు వీ లెరుంగక, తమకడకే మరలి వచ్చిన గత్యంతర మాలోచింతు రనియు లేకున్నఁ గార్యభంగ మగుననియు యోజించి తమను దర్శించితిమి.

సదా: అక్కటా! దైవయోగము నెవ్వరు తప్పింపఁగలరు! కట్టా! హేమలతా చంద్రశేఖర సంయోగ మెట్లు నిర్వహింతును? ఇక్కట్టులయం దధైర్య పడి వాపోయి ప్రయోజన మేమి? కానీ! దైవమే కలఁడు. మూర్ఛ తేచిన వెంటనే హేమలతను దోడ్కొని వచ్చి యీదరిగృహమున డాచి చంద్రశేఖరునిఁ జేర్చు నుపాయమాలోచించెదఁగాక! తమ్ముఁడా! తడయక యొక దివిటీ సిద్ధపఱుపుము. శ్మశానవాటికకుం బోవలయు.

(చిదానందమునితో నిష్క్రమించును)

## తృతీయరంగము

[చంద్రశేఖరవిజయవర్మల ప్రవేశము]

చంద్ర: (బావమఱఁదిపై నొక చేయివేసి రెండవచేత నిర్దేశించుచు)

మ. అదియే! హేమలతాసతీవదనరాకాబ్జారికాంతిప్లుతా
స్పదదేహైకకళాప్రభూతపరితృప్తస్వాంత సమ్మోదసౌ
ఖ్యదశాంతర్గతుఁ జేసియుండిన గవాక్షం బక్కటా! నేఁడు మ
ద్ధృదయావేగతమఃప్రకల్పన సముద్దేకాకృతిం గ్రాలెడిన్.

విగత హేమలతాసతీవలగ్న బాంధవోద్భూత సంతాప సూచిత గగన నిష్యంద నీహారాంబుకణంబులు ప్రథమమదనకేళీలాలసాయాసజనిత నవ్య ముక్తాఫల సారూప్య ఘర్మాంబుబిందు సందోహకందళితాళిక ఫాల ఫలకము స్మృతికిం దెచ్చుచున్నవి. వన్యసూన సుగంధ సమ్మిళిత మలయగంధవహ పరిచర్యానుకూలురమై, భారద్వాజవిహంగిప్రియగీతాన్యద్విజ సంతాన ప్రోక్త మంత్రమంగళవాద్యధ్వనులతో, ప్రకృతిదేవీ సాక్షీభూత ప్రతిజ్ఞా వాగ్విలసనంబుల, తదీయారామవిరాజిత పున్నాగ శాఖా కరచ్యుత వితత విశద సుమ లాజ విభూషితుల మాచు నిర్వహించుకొనిన గాంధర్వోద్వాహస్మృతి, హృదయనిర్భేదక మగు చున్నది. జీవితేశ్వరీ ప్రియాలాపాయుస్సాంత ప్రభావ సముల్లంఘన క్రియానుకూల్య కల్పనంబైన యీ ప్రాకారము, ప్రాణేశ్వరీ శాశ్వత వియోగ సంజనిత విషాద పారావార మజ్జితోన్మజ్జితుఁడ నగు నా కలంఘ్య మహాగిరీంద్రము

హోరెఁ గానఁ బడుచున్నది. క్రమక్రమముగ ప్రాపించిన స్వభావ మిథ్యా కలనావ్యాప్తిసంక్షుభితహృదయుండై నగుచున్నాఁడు.

విజయ :

మ. అకటా! యేమని యూరడింపఁ గలనయ్యా! గర్భనిర్భేదన
ప్రకటానర్గళ వజ్రపాత మిది, శాస్త్రప్రోక్త కర్తవ్యబో
ధకుఁడౌ స్వామినిఁ జేరఁబోదము, భవత్సంతాపభారావహ
ప్రకృతావస్థఁ దొలంగఁద్రోచు మదభిప్రాయంబు పాటింపవే.

చంద్ర : ఓయీ! వెఱ్ఱివాఁడా! నీవు కృతయుగములోనివాఁడవు.

గీ. సర్వసంగపరిత్యాగధూర్వహునకు
శాస్త్రసంస్థితాభిప్రాయసార మేల?
స్వాత్మబుద్ధి జలపథవిహారపరున
కన్య పురుషనీతివ్యవహార మేల?

సముద్రము మోకాలిబంటి యొనర్చు తెగువ కైదండ యొసఁగుచుండ నా కన్య విచార ముండఁగలదా!

విజయ : అయ్యో! ఆత్మహత్య మహాపాతకము సుమా!

చంద్ర : ఔను, కాని మదుద్యమము మాత్ర మందుఁ జేరదు. మదాత్మ నేటి ప్రాతఃకాలముననే సతియాత్మయం దైక్యముఁ గాంచెను. చంద్రశేఖరుఁడు కృత్రిమజీవాకృతి. కేవల మొక జంత్రపుం బొమ్మవలె నీ యెదుట నిలిచి యున్నాఁడు. నిమిత్తమాత్ర మైన మదుద్యమము, తదవశిష్టంబుఁ గూడఁ దీర్పఁగలదు. తెలిసినదియా! ఇప్పటికే రెండుదివసములు వెనుకఁ బడితిమి. శ్మశానవాటికకుం దారితీయుము. తడయక నడువుము.

(పరిక్రమించుచున్నాఁడు)

(పిమ్మట యథావిధిని పెట్టెయం దిముడ్చబడియున్న హేమలత మూర్ఛాగత శరీరమును ప్రాంతవన పుష్పములతో గోపాలవర్మయు నొక సేవకుఁడును నుందురు)

గోపా : (హేమలతయున్న పెట్టెఁ దెఱచి) సెచ్చెలీ! పీటలమీద పెండ్లి శ్మశాన వాటికగా పరివర్తన మైనందుల కెంతని విలపింతును. అకటకటా!

ఉ. ఇంతకుఁ బూర్వకర్మదురదృష్టవిపాకపిశాచ ముగ్రదు
ర్దాంతవిషాదవహ్నిపరితప్త శరీరునిఁ జేసె, మన్మన
శ్శాంతికి నౌషధం బది విషగ్రహణం బొకటున్న దంతె, భా
స్వంతు కొలంబు పేరి కలశాబ్ధి జనించిన చంద్రబింబమా !

అనన్యవేద్యమైన భవదకాలమరణోదంతమునకుఁ గారకుఁడను నేను గానని తలంచెదను. పుణ్యవతి వగు నీవు కలియుగంబున నీ యవతారము చాలించి చరితార్థ వైతివి గాక! పాపసంకలితచిత్తుండ నగు నే నింకను నిన్ననుసరింప వెనుకముందాడుచున్నాను. ఆహా! మృత్యుదేవత త్వత్ప్రాణహరణసమర్థ యయ్యెఁగాక! నీ శాశ్వతలావణ్యగుణచిరసంపదలఁ జూఱగొన లేక పోయెను. నీ యవతారనిర్గమనానంతరము ప్రపంచమున సౌందర్యమే గొడ్డు వోయినది. భవల్లావణ్యస్మారకచిహ్నసంతానశేషమైనను నీ సుషమ వసుధా తలంబునకుఁ గొఱంత లేకపోవుటయే గాక నే నింత వాపోయి యుండను. రవంత దూరాలోచనఁ జేసిచూచిన చచ్చినవారితోడఁ జచ్చిన వచ్చెడిమేలు లేదని స్పష్టపడు చున్నది. కనుక నిట్లగుంగాక!

గీ. నవనవోత్ఫుల్ల దివ్యప్రణయ విభూతి
సంస్కృతిం బాసి తీ వసుసంచయమ్ము
తత్ప్రియయ కలాధిష్ఠాత్రి దైవతమ్ము
నా పరాంబిక కరుణ ని న్నాదుకొనుత.

(పూవులఁ జల్లుచున్నాడు.)

సేవ : (నిర్దేశించి చూచుచు) అల్లదిగో! చేరువ నెవ్వరో వ్యక్తిద్వయ మిట్లే నడచి వచ్చుచున్నట్లు కాన్పించెడిని. అముందు వచ్చునది ప్రతాపవర్మగారి కుమారుఁడువలె నున్నాఁడు. ఈయన పురబహిష్కృతుఁడై సౌగంధద్వీపమున కంపఁబడియెఁగదా! ఎప్పుడు తిరిగి వచ్చియుండును? ద్వితీయవ్యక్తి విజయవర్మవలె నున్నాఁడు. వీరి పోక యెక్కడికై యుండును? శ్మశానవాటికకేనా? కారణం బేమై యుండఁగలదు? నా యజమానున కీ సమాచార మెఱింగింపవలయు. (గోపాలవర్మను సమీపించి) స్వామీ! చంద్రశేఖర విజయవర్మ లిరువు రిచ్చటి కేతెంచుచున్నారు.

గోపా: ఛీ! ఇదెక్కడిమాట! పోల్చుకొనుటయందు పొరఁబడియుందువు.

సేవ: దేవా! లేదు. విద్యుద్దీపకాంతి నిర్వురను జక్కఁగా గుర్తించితిని.

గోపా: అట్టైన రాజశాసనాతిక్రమణ మొనర్చి చంద్రశేఖరుఁ డిప్పు డిచ్చటి కరుదేర తెగువఁ బూనఁదగినంత హేతువు గాన్పింపదే? సరే కానిమ్ము.

సేవ: చిత్తము. (యథాస్థానమున మరుగుగా నిలుచుండును)

[చంద్రశేఖర విజయవర్మలు యథావిధిఁ బ్రవేశించెదరు]

చంద్ర: విజయా!

మ. అదె కాఁగోలు సతీ సమాధి, మృత దేహం బైన వీక్షింపఁజా
లుదునో, చాలనొ? నా యభాగ్య మది యీలో నేమి కల్పింపను
న్నదో, దైవోపహతుండనై తుదకు ప్రాణత్యాగ దీక్షాప్రభా
వ్యాదయోత్సాహ పరాఙ్ముఖుండ నయి వర్తింపంగ నుంకింతునో!

విజయ: (ఆత్మగతము) ప్రియుశః దారికి రావచ్చును. ఆత్మహత్యాభిలాష క్రమ క్రమముగ క్షీణించుచున్నది. (ప్రకాశముగా) బావా! మృతకళేబర సందర్శనము మాత్రము నీ కెట్టి దుఃఖోపశాంతి సంధింపఁగలదు? చెప్పుము, కేవల మలౌకికవ్యవహారము నకుఁ గడంగుచున్నావు. నీకుఁ దోచుటలేదు. ఒకరు చెప్పిన వినుటలేదు. మరలి పోవుదము. గృహాభిముఖుండవు గమ్ము.

చంద్ర: విజయా! ఇహలోక సంబంధము మానుకొనఁ దలఁచు నాకు లౌకికజ్ఞాన మెందులకు? నీకుఁ దెలియదు. మిన్నకుండుము.

(నడచుచున్నాఁడు, విజయవర్మ వెన్నాడును)

చంద్ర: విజయా! గోపాలవర్మ యిందుండఁ గతం బేమి!

విజ: హేమలతాకరగ్రహణాభిలాషచే, నీతఁడేకదా మన కొంపకు నిప్పు ముట్టించినది.

చంద్ర: సరి సరి. (శిరఃకంప మొనర్చుచు మఱి రెండడుగులు వైచును.)

గోపా: చంద్రశేఖరా! నిలు నిలు. అడుగెత్తితివేని యమపురిఁ జేర్తు.

చంద్ర: (చిరునగవున) గోపాలవర్మా! నే నభిలషించునదియు నదియే.

గోపా: ఛీ! ఛీ! దుశ్శీలా! నోరు మెదల్పకుము.

మ. పురుషాకారసతీస్వభావుఁడవు ద్విడ్భూపాలపుత్రీప్రహా
స్మరణోద్యద్దురితావకాశత సఘుప్రారంభదుశ్శీలత
త్వరచిత్తుండవు నిన్ క్షమించునె? బలప్రోల్లద్వ్యధస్త్రైకరా
జ్వరమాస్థాపనశౌర్యనిర్వహణదోస్స్తంభప్రతాపోద్ధతుల్.

(కత్తి దూసి మీదికిం దుముకుచున్నాఁడు.)

చంద్రి: (మందహాసముతో) గోపాలవర్మా! రాచబిడ్డఁడ వైనందులకు నైసర్గిక న్యాయవిచక్షణ తత్పరత్వము కలిగినందులకు నాకెంతయు సంతసము. కాని యౌవన రక్తోద్వేగమున వేగిరింపకుము. శాంతించి నా హేమలత కడకు దారి వదలుము. తెగఁబడివచ్చుచున్న చంద్రశేఖరున కడ్డు నిల్వకుము. నీకును హేమలతకుం గల సంబంధబాంధవముకంటెను మామా యిహపర సంబంధమే యెక్కుడని నీవు గుర్తింపుము. హేమలతకు నా వలననే యవమానమైన నింకఁ గాపాడఁగలవాఁడెవండు? కనుక నన్నెదిరింపకుము.

శా. సీసీ! రోష విదూషితుండను వృథాచింతన్ బడంబోసి వి
శ్వాసం బుంచుము చంద్రశేఖరుని యీ సత్కీర్తికిం బైఁ దిత్సతీ
దాసత్వాంచితబుద్ధి యీతఁడు, ప్రియాధ్యాత్మైకనిష్ఠామహా
వేశోద్విగ్నవిదీర్ణచేతసుని నన్ బ్రేరింప కిప్పట్టునన్.

(గోపాలవర్మను లక్ష్యముచేయక నడచును)

గోపా: ఓరోరి కుటిలోపాయధురంధరా! అన్యాయముంబుగ శూరసేన హత్యా కృత్యమునకుఁ బాల్పడిన దురాగతము చాలక మృతకళేబరముపై పగ సాధింప సంకల్పించిన కఠినహృదయా! నిలునిలు.

(అడ్డగించుచు)

శా. మాయోపాయవచఃప్రచారకృతదుర్మార్గక్రియాశీలతా
హేయద్రోహపరీతచిత్తుఁడవు, త్వద్ధింసామయప్రాణనా
శాయత్తప్రథితప్రతాపవితతోద్యద్ద్వంద్వ సంగ్రామ గాం
గేయ ప్రాభవ విశ్వవంద్య బలశక్తి స్థైర్యు నన్నోర్తువే!

(కవియ నుంకించును)

చంద్ర : ఇప్పటికిని నిన్ను సైరించుచున్నాను. దూరదృష్టిఁ గనుము. ఓహో విభ్రాంతుఁడవని, వయసున నేగాక శస్త్రపాండిత్యమునను గేవలము కొండిక వాఁడవని చాలియుఁ జాలనివాఁడవై వెనుకంజవేయుచున్నాను.

గోపా : (పకపకనగుచు) ఛీ! ఛీ! వీరాగ్రేసరుఁడను మూరెడు బిరుదు, బారెడు ఖడ్గము ధరియించి ధైర్యముతో వెనుదీయు నిన్గనిన నాకు హాస్యమగుచున్నది. నీవు కాలికి బుద్ధిఁ జెప్పినను నినుఁ బోనీయను. (మీదికి వచ్చును)

చంద్ర : రే! దుర్మదాంధమర్విదగ్ధా! అతిక్రాంతమర్యాదా! "వినాశకాలే విపరీతబుద్ధిః" అను లోకోక్తి ననుసరించి వాయోపనిదురుక్తులు వెలువరించుచున్నావు. మీదిమీదికి వచ్చి నా శౌర్యమును, సామర్థ్యంబును, ఖడ్గప్రావీణ్యమును న్యూనపఱచుచుంటివి. మాతోపాటు నీ యాయుఃపరిపూర్తి గూడ గానోపును. ఏదీ! నీ పెంపు తెంపులు చూపింపుము.

(కవియుచున్నారు. చంద్రశేఖరుఁడు గోపాలవర్మను సులభంబుగ వధించును.)

సేవ : అయ్యో! చచ్చితిని, చచ్చితిని. నాకు దిక్కెవరు? ఈవర్తమానము రాజకుటుంబమున కెఱింగించెదను.

(పరుగిడు చున్నాఁడు)

చంద్ర : విజయా! ఈవృత్తాంతము వినినచో రాజకుటుంబమే కాదు. విశాలపురమే యుచ్చటకుం బయన మగును. నీవు కనిపెట్టియుండి యెవరిజాడ యైనఁ బొడకట్టిన తత్క్షణము నాకు నివేదింపుము.

విజ : సరి. (విజయవర్మ కొంచెము దూరముగ నిలుచుండును)

చంద్ర : ఆహా! ఇఁక మదుద్యమముఁ గొనసాగించుకొనుటకు నిష్కంటకుఁడనైతిని. (నడచి) ఆహా! ధన్యోస్మి! ఏమిది! ఈపె,

ఉ. ప్రాణవిహీన యయ్యు సహజాసమదీధితి గోలుపోక ని
ద్రాణసుపర్వభామినివిధంబునఁ బాండురవక్త్రశోభితా
క్షీణ మృదుస్మిత ప్రథిత జీవకళాకలితాభిరామ క
ల్యాణతనుప్రసిద్ధిఁ దనరారు విమోహనరూపసంపదన్.

చిత్తమా! కించిదశాంతికిఁ గూడ తావొసంగక సతీనిష్కళంకాత్మైక్యము నవధరింపుము.

(గుప్తపఱచిన విషద్రావకమును గైకొని)

మ. అదె నా రాకకు వేచియున్న దఁట నా యర్ధాంగి, ఆత్మైక్యసం
పదఁ గాంక్షించి, సతీసహానుమరణప్రాప్తిప్రథాపుణ్యాక
ర్మదిదృష్టాగత దివ్యశంసిత చరిత్రస్ఫూర్తిఁ జందార్క భా
స్వదమానగ్రహతారకస్థితిఁ గనన్ జాలింతు ప్రాణంబులన్.

(తాగుచున్నాఁడు.)

విజయ : ఆ! ఆ! బావా! బావా! (పరుగెత్తుకొని వచ్చును.)

చంద్ర : (మందహాసముతో) హేమలతా! హే...మ...లతా. హేమ...

(శిలపై హేమలత ప్రక్క వ్రాలి మరణించును)

విజయ : (ఏమియుఁ దోచక దుఃఖభరమున నటునిటు పరుగులిడుచు)

శా. ఇంకేమున్నది కొంపయే మునిఁగిపోయెన్ వైద్యసాహాయ్య మే
వంకన్ జిక్కు? శ్మశానవాటిక నిశాబద్ధాంధకారంబు, ని
శ్శంకాతంక కృతప్రతిజ్ఞుని మనస్సంకల్ప మీడేరె, మీ
నాంకప్రాభవ మింతగూర్చెను సదానందుండె నా దిక్కగున్.

(నిష్క్రమించును)

హేమ : (పెట్టెయందుఁ గదలుచు లేచి) అహా! సదానందయోగి సత్కృప
గోపాలవర్మ బారిఁ బడకుండఁ దప్పించెను. మన్మనోధవుని జాడగాని,
సదానందుని జాడగాని గాన్పింపదు. (నడచుచు) ఆ. ఆ. గోపాలవర్మ.
గోపాలవర్మ క్షతగాత్రుఁడై యుండఁగ తంబేమి! ఇది యేమి యద్భుతము.
వీరపురుష విక్రమకేళీ పాదసంఘట్టనోద్ధూతధూళిధూసరితమై యీ ప్రదే
శము రణరంగము ననుకరించుచున్నది. (రెండడుగులు నడచి చంద్రశేఖరు
నకస్మాత్తుగ దర్శించి) హా! ప్రణయనిధీ! హతోస్మి.

(మూర్ఛిల్లును. కొంతవడికిఁ దెప్పరిల్లి)

మ. అకటా! హేమలతాసతీమరణవృత్తాంతంబు విన్పింప గుం
డెకు వ్రేఁగై యసువుల్ త్యజించె నిట నా నేత్రద్వయజ్యోతి, దై

వక్రపాశూన్యత, నిశ్చితార్థ మెఱిఁగింపక లేదుకాఁబోలు, భ
ర్తకు నెవ్వారలు, నేనుమాత్ర మిఁక నే రాజ్యంబుఁ బాలించెదన్.

భర్తృ సహ స్వారాజ్యానుభోగపరత్వము కర్తవ్యము. హాలాహల పానంబున నే జీవితేశ్వరుఁడు మరణించినట్లు హస్తగతశూన్య కాచపాత్రము స్పష్టపఱచెడిని. (లేచి కాచపాత్రముం జూచి) ప్రణయనిధీ! ఎంతటి యన్యాయ మొనర్చితివి. అర్ధాంగినైన నా భాగముఁ గూడ నీవ యారగించు టర్హమా? భవదోష్ఠసంస్పర్శచే నమృతహాలాహలంబులు రెంటెని యోగపద్యంబున ననుభవింతు. (చుంబించి) అయినను భవదీయనైసర్గికాధరసుధారస ప్రభావంబున హాలాహలము పనిచేయలేదు. ఇతరసాధనభ్రాంతి యేటికి? భర్తృ దక్షిణ హస్తపరికాశిత నిశిత కరవాల దర్వీకర ఫూత్కృతజ్వాలా మాలికలే నా శరణ్యము. (భర్త ఖడ్గ మందుకొని) ఓహో! నిష్కళంక ప్రణయామృతభాండారమా! జీవకళావిహీన మైనను భవచ్చరణ సరోజ సేవాభాగ్యప్రాప్తి నా కవసానదశయం దైనను లభించెను. చాలు! (భర్తృ పాదరజమును కన్నుల కద్దుకొని) ఇదె వచ్చుచున్నాను. దూరమున జనాగతసూచక మైన సందడి యగుచున్నది. త్వరపడియెదను.

శా. దాంపత్యం బొక పూటనైన నను, మహోద్యల్లీల భోగించినా
మింపుల్ బెంపు దలిర్పఁ, దీరె విషయాభీష్టంబు, భార్యాప్రియో
గంపుం బ్రక్రియఁ బ్రాణముల్ విడువఁగాఁ గాంతుండె, యర్ధాంగినై
తెంపుం బూనక జంపుఁ జేసెద నె యాత్మీయాసువిచ్ఛిత్తికిన్.

(కత్తిచే వక్షఃస్థలమునఁ బొడిచికొని)

(హీనస్వరమున) హా! చం...ద్ర...శే...ఖ...రా

[చంద్రశేఖర పాదపద్మంబుల చెంతఁ బ్రాణములు విడుచును.)

సర్వము సమాప్తము

